శ్రీ

# సతీసక్కుబాయి

[ ఐదంకముల స్వతంత్ర నాటకము ]

ఇది

స్వరాజ్యరథము, రంగూన్ రౌడీ, సతీ అనసూయ, గంగావతరణము, ధరణి,
భక్తవిజయము, కాలకేతనము, తాజ్‌మహల్, భోజకాళిదాసు
మున్నగు ననేక స్వతంత్ర నాటకములను;
శిశుహత్య, వనదుర్గము, తపోవనము, జపమాలిక, రక్తజ్వాల
మున్నగు ననేక స్వతంత్ర నవలలను
రచియించి ప్రఖ్యాతివహించిన
దేశముఖు, దేశపాండ్యా,

## సోమరాజు రామానుజరావుగారిచే

రచియింపఁబడి,

## బెజవాడ, శ్రీసరస్వతీ బుక్ డిపో వారిచే

ప్రకటింపఁబడినది.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

1933

సర్వస్వామ్యములు ప్రకాశకులవి. } తెనాలి, రామకృష్ణ ప్రింటింగువర్క్సునందు ముద్రితపఁబడినది. { వెల 0-12-0 మాత్రమే.

# హెచ్చరిక

ఈపుస్తకముయొక్క సర్వహక్కులును నాకు చెందియుండుటచేత, దీనిని పునర్ముద్రణముచేయుటకుగాని, భాషాంతరీకరించుటకుగాని, ప్రదర్శించుటకుగాని ఇత్యాదులకై నా వ్రాతమూలకమైన అనుమతిని పొందనివారు నేను చేయు సివిల్, క్రిమినలు చర్యలకు పాలగుదురని ఇందుమూలముగా హెచ్చరింపనైనది.

ఇట్లు,

కురుకూరి సుబ్బారావు,

ప్రకాశకుఁడు.

# విన్నపము

సుప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే రచింపఁబడి దేశవ్యాప్తిగఁ బ్రదర్శింపఁబడుచున్న ఒక సక్కుబాయి నాటకము దేశీయులదృష్టి నాకర్షించియున్న యిక్కాలమున, నేను ఆకథనే, మఱల నాటకరూపమున రచించుటకు కారణమునుమాత్రమే పాఠకమహాశయులకు నే నీ చిన్ని విన్నపము మూలమున మనవిచేసికొనఁ దలఁచినాను. శ్రీశాస్త్రిగారి నాటకము ఇంతలో ముద్రింపఁబడునను—ఆశకలుగకపోవుటకుఁ గొన్ని కారణములు గల్గుటచేతను—మనదేశమునందలి నాటకసమాజము లనేకములు, రంగస్థలానుకూలమగు సక్కుబాయినాటకము వలయునని వాంఛించుటచేతను—వాస్తవమునకు నాకు సంపూర్ణ మనస్సమాధానములేకున్నను రచింపక తప్పినదిగాదు. నా యితర నాటకములన్నిటింబలెనే—దీనినిగూడ సరస్వతీ బుక్ డిపో వారే ప్రకాశింపఁజేసిరి. ఈనడుమ అనేక సక్కుబాయినాటకములు ప్రకటింపఁబడినవి. కాని, యవి యన్నియును—శ్రీశాస్త్రిగారి నాటకమున కనుకరణములే యగుటచేతను—విశేషించి శ్రీశాస్త్రిగారి నాటకమునంగల రసము లోపింపఁగా—రంగస్థలానుకూల్యత కొఱవడుటచేతను, గూడ నానాటకరచనమునకు కారణముగల్గినదని విన్నవించుచున్నాను. ఈనాటకమును రచించుటలో—నేను శ్రీశాస్త్రిగారినాటకము ననుకరింపక సాధ్యమైనంత స్వతంత్రముగనే రచింపఁ బ్రయత్నించితిని. కాని అత్తపాత్రమునుమాత్రమును నా నాటకమునగూడ నాటకసంఘముల కోరికపైఁ జేర్చితిని. ఐనను—అత్తలేనిచో సక్కుబాయికథయే లేదనియు, ఎవరు ఎన్నిరీతుల ఈకథను రచించినను అత్తను లోపింపఁజేసి రచింపఁజాలరనియు నానమ్మకము. ఇందలి గుణదోష విచారము పాఠకులకే వదలివేయుచు, ఇంతటితో విరమించుచున్నాను.

విజయవాడ
గాంధినగరం
5—10—1933

ఇట్లు బుధవిధేయుడు,
సోమరాజు రామానుజరావు.

# పండితాభిప్రాయములు

మహారాజశ్రీ దేశముఖు, దేశపాండ్య, సోమరాజు రామానుజ రావుగారిచే రచింపఁబడిన, "సతీసక్కుబాయి" అను నాటకమును సంపూర్ణముగ చదివితిని. వీరి నాటకములనుఁ దిలకించి—వీరి కవితా రసమునుఁగ్రోలని యాంధ్రులుండరు. శ్రీరామానుజరావుగారు—ఆంధ్ర దేశమునందేకాక, సుప్రసిద్ధమగు రంగూన్‌పట్టణమునందు సయితము—"సతీఅనసూయ—రంగూన్ రౌడి" మున్నగు సుప్రసిద్ధ నాటకములను రచించి—అచ్చటి నాటకసంఘములచేఁ బ్రదర్శింపఁజేసి, రంగూన్ పుర వాసులకుసయితము, ఆంధ్రభాషాభిరుచిని—ఆంధ్రనాటక కళాగౌరవ మునుఁ గల్గించిన సుప్రసిద్ధ కవిపుంగవులు. వీరి, "రంగూన్ రౌడీ" మొదలగు నాటకములు, ఆంధ్రదేశమునందు సయితము—అనేకనాటక సంఘములచే పెక్కుసార్లు ప్రదర్శింపఁబడి, జనామోదకరములగుటయే, వీరి కవితాశక్తిని వేనోళ్ళఁ జాటుచున్నది. వీరికవిత్వము—అతిమృదు లమై—శైలి సరళమై—రసవంతముగనుండుట అతిశయోక్తిగాదు. 'రంగూన్ రౌడీ' మున్నగు నాటకములందు వీరుజాతీయతను, చక్కఁగా కన్పరచి, నాటకమునకు, నవీనశోభను గల్పించిరి.

వీరి నాటకరచనయందు—రంగస్థలానుకూలములగు ఘటనలను సమకూర్చుటలో ఘటికులు. ఇట్టి రంగస్థలానుభవమే—నాటకరచనకు ముఖ్యమని, నాయభిప్రాయము.

"సతీ—సక్కుబాయి" చరిత్రముకూడ, రంగస్థలానుకూలము లగుకూర్పులతో, సరళములై రసవంతములగు పద్యములతో, మనో రంజకములగు గద్యములతో, రచింపఁబడినది.

బ్రహ్మశ్రీ విద్వత్కవి మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే రచింపఁబడి—ఇంతవఱకు, ఆంధ్రదేశమున ప్రసిద్ధముగా ప్రదర్శింపఁ బడుచున్న "సక్కుబాయినాటకము" నకు అనుకరణముగాక—పెక్కు

తావుల స్వతంత్రములగు పాత్రలనుసృజించి—తత్తద్రసోచితములగు రచనలనుగావించి, సహజకల్పనాశక్తిని గన్పరచిరి. సక్కుబాయిపాత్ర మునకుఁగల్గిన భక్తిపారవశ్యమున, కవిగూడ పారవశ్యతనంది రచించి నట్లు గన్పట్టుచుండును.

ఇట్టియోగ్యనాటకమును రచించిన శ్రీ సోమరాజు రామానుజ రావుగారు—ఆంధ్రసోదరుల కృతజ్ఞతకు ఎంతయుఁబాత్రులై—ఇంకను, అనేక నవీననాటకములను రచియించి—ఆంధ్రభాషాయోషకు వన్నె నిడుదురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,

విజయవాడ.<br>
24—9—33.

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి.<br>
(సావిత్రీనాటక కర్త)

---

మ॥ రా॥ రాజశ్రీ సోమరాజు రామానుజరావు దేశముఖ్, దేశపాండ్యాగారు రచియించిన, యీ "సతీ—సక్కుబాయి" రూపకముం గాంచితిని. కాని, ఇందలి గుణాగుణవిమర్శనము, నావంటి సామాన్య వ్యక్తికి దుస్సాధ్యమేయైనను, పుస్తకము సమగ్రముగఁ జదివితిగాన— మానసోత్సాహముమాత్రము సాహసింపఁజేసినది. ఆహా! నే నీవరకెన్ని మాఱులో, నీకవీంద్రుని స్తుతిపాఠముల, నామిత్రులచే—వినియున్నాను. విన్నందుల కీనాడు నామనస్సెంతయో సంతృప్తినొందినది. ఏలయన— నాటకములువ్రాయుకవివర్యులుగాని, రచియింపఁబడిననాటకములుగాని, అపరిమితముగానేయున్నవి. ప్రదర్శనానుకూలముగను—పఠనానుకూల ముగను—తూచినట్లు రసవత్తరముగ నీసతీసక్కుబాయి నాటకమునకు వలె నాహృదయమునకు ముదముగూర్చిన నాటకములుకొన్నిమాత్రమే యనకతప్పదు. ఇట్టినాటక రచయితలు నాటకములు—మనదేశమున

తామరతంపరగా నభివృద్ధినొంది, దేశీయుల హృద్దీపికలకు నిర్మలనీతి విద్యుద్దీప్తుల నైక్యపరచి, శాశ్వతానందయశముల నందుదురుగాత. యని, భగవంతునిఁ బ్రార్థించెదను.

ఇట్లు,

జక్కేపల్లి. ఖమ్మంతాలూకా, నైజాం. 25—9—33.

అష్టావధాని,
చందాల కేశవదాసు.
(కనకతారానాటక కర్త)

---

అయ్యా, తాముపంపిన సక్కుబాయినాటకము, అక్కడక్కడ చదివినాను. సంతోషము కలిగించినది. ముద్దులొలుకు సుద్దులు, రస ములఁజిమ్ము తావులు, మానికలఁగొలవఁదగిన యలంకారములు, రతన ములు, మూటలనం దగు నీతులు, శాస్త్రీయమై, హృదయంగమమగు పాత్రపోషణలుకలిగి, చదువ చదువ, జవులూరఁజేయునని తోచినది. యనేకములగు, నాటకరాజముల, రచించిన, రామానుజరావుగారికి, నిది సహజపాండిత్యమని చెప్పుట, యతిశయోక్తిగాదని నా యభిప్రా యము. రంగస్థలముల ప్రేక్షకజనాదరణ వడసి 'సక్కుబాయి' యీాలువ తనముతోపాటు, దిగంతవిశ్రాంతమగు కీర్తివహించుగాతయని, సర్వదా కోరుచున్నాడ.

విద్వత్కవి, మల్లాది అచ్యుతరామశాస్త్రి,
S. K. P. V. V. హైస్కూలు,
ఆంధ్రప్రధానోపాధ్యాయుఁడు.

బెజవాడ, 3—10—33.

---

# పాత్రములు.

## పురుషులు

1. కాశీపతి—సక్కుబాయి భర్త.
2. జ్ఞానయోగి—ఒక పంచమసిద్ధుఁడు.
3. కృష్ణుఁడు—పండరినాథుఁడు,
4. నారదుఁడు—దేవర్షి.
5. శంభుశాస్త్రి- } అగ్రహారవాసులు.
6. పెద్దిసెట్టి— }

## స్త్రీలు

7. సక్కుబాయి—కథానాయిక.
8. అత్త—కథానాయిక అత్త.
9. రాధామాయి— } శ్రీకృష్ణుని దేవేరులు.
10. రుకుమాదేవి — }

☞ సందర్భానుసారముగ, జ్ఞానయోగి శిష్యులు, భక్తులు, పౌరులు వత్తురు.

# శుద్ధపత్రిక.

☞ సామాన్యదోషములు వదలివేయఁబడినవి. ముఖ్యములగు మార్పులు మాత్ర మీశుద్ధపత్రికయందు చేర్పఁబడినవి. పాఠకులు శుద్ధపత్రిక ప్రకారము తొలుత గ్రంథమును సంస్కరించుకొని పిదప చదువవలయును.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 16 | సీ॥ "ఆత్మవత్సరభూతాని" | "ఆత్మవత్సర్వభూతాని" దివ్యోక్తులు దెలిసిన......... |
| 9 | 19 | వినశ్వరమగు...... | అనశ్వరమగు...... |
| 17 | 21 | సీ॥ శుభఫాలమున | శుభదేహమున |
| 31 | 10 | పరిమళోక్తసుగంధ | పరమళయుతగంధ |
| 40 | 5 | సంభూతంబు | సంఘాతంబు |
| 46 | 7 | జీవన్ముక్తి | దేహావిముక్తి |
| 76 | 21 | మాయాప్రయుక్తకాంతి | మాయావిముక్తకాంతి |

## అనుబంధము.

| | | | |
|---|---|---|---|
| 113 | 20 | ముఖారి | హిందూస్థాని ముఖారి |
| 114 | 9 | కస్తూరీహితనిటలే | కస్తూరీయుతనిటలే |
| 114 | 22 | నేగికథని | నేగినకథని |
| 115 | 5 | కష్టాంమును | కష్టాంతమును |



# సతీ-సక్కూబాయి

## ప్రథమాంకము

1వ రంగము—సక్కూబాయి ఇంటిముందరివీథి.
ప్రవేశము—జ్ఞానయోగి కొందఱు శిష్యులతో.

అందఱు—(అనుబంధము 1.)

1 శిష్యుఁడు—గురునాథా! ఇది బ్రాహ్మణవీథిగాఁ దోఁచుచున్నది. పంచమకుల సంజాతులమైన మనలను బ్రాహ్మణులు, పశువుల కన్న నీచముగాజూచి, దరిఁజేరనీయరుగదా! అట్టిపరాభవ మేదియు జరుగకముచున్న మనంతట మనమే, వేఱొకవీథికిఁ బోవుట శ్రేయస్కరముకాదా?

జ్ఞాన—నాయనా! సర్వభూతసమదయాపరుఁడగు పరమేశ్వరునియనంత సృష్టియందు— తమతో సమానముగ సృజింపఁబడిన మనలను బ్రాహ్మణులు దరిజేరనీయకుండుట వారిజ్ఞానలోపముకావచ్చును. కాని బ్రాహ్మణవీథియందు నడచినంతమాత్రమున, ఈశ్వరుని దృష్టియందు మన మపరాధులము కాముగదా! అదియే మన కానందము. మూఢలోకముతో మనకు పనిలేదు—అయినను, లోకమంతయు నంతయజ్ఞానమయమై యుండునా?

సీ॥ "ఆత్మవత్సర్వభూతాని" యనెడుసూక్తిఁ
దెలిసిన విజ్ఞాన తిలకు లుండ,
"అస్పృశ్యతా దోష" హరణార్థమై జన్మఁ
గాంచిన ఘనదయాగంధులుండ

"ప్రకృతిసర్వము నీశ్వరాయత్త" మను వివే
కానందు లెందఱో యవనినుండ
మాతృదేశదరిద్ర మారణవ్రతులైన
గోకుల సద్భక్త కోటులుండ,
నిమ్నజాతులరక్షింప నియతిగొన్న
రామమోహన పావన నాములుండ
భరతఖండాన, నికముందు పంచములకు,
పతన దుర్గతిగల్గునే? ప్రభుఁడులేఁడే? ॥ ౧

కావున మనకేమియు భయములేదు. దూషణ భూషణ తిర స్కారము లీనశ్వర శరీరమునకుంగాక, శాశ్వతమగు పరమాత్మకులేవు. రండు పోవుదము.

( అనుబంధము 1. ) (పాడుచు నిష్క్రమింతురు)

(తరువాత పాటవినుచు సక్కుబాయి ప్రవేశించును)

సక్కు—ఓహో! ఎక్కడిదీగానము! బ్రహ్మానంద సంధాయకమై యొప్పుచున్నదిగదా!

గీ॥ దశదిశల హాయిగా ప్రతిధ్వనుల నీన,
జల్లుమనిమేనఁ బులకలు సంతరింప,
"రంగరంగా" యనుచు తంబురారవంబుఁ
గలసి విననయ్యె నభినవ కంఠరవము॥ ౨

ఎన్నడును వినరాని యీ భగవత్సంకీర్తన మీనాడు వినఁబడుట చిత్రమే! ఆమహాభక్త శిఖామణు లెవ్వరై యుందురోకదా?

( మరల గానము వినఁబడును. అనుబంధము 1 )

సక్కు—( కొంతతడవు విని యానందములో పారవశ్యమునంది తానును కలిసి పాడుచున్నది)

(తరువాత సక్కుబాయి అత్తగారు ప్రవేశము)

అత్త—సక్కూ! సక్కూ! ఎక్కడ పెత్తనాలు వెళ్ళుచేస్తున్నావు? (చూచి) ఓసి నీయమ్మచచ్చిపోనూ! ఆ సంగీతాలేమిటి? ఆతాళాలేమిటి? ఆపాడటమేమిటి?- నీకేమైనా దయ్యము పట్టినదా యేమే?- వసేవ్! నిన్నే! మాట్లాడవేమి? ఇంటిలో గంపెడు చాకిరీ వెనకవేసి, నడివీధిలో యీసంగీతాలేమిటి?- ఓసిముద్దా! నామాట వినఁబడదాయేమే?- ఓసి పాపిష్టిదయ్యమా! ఎంత వాగినా మాట్లాడకుండా రంగా రంగా అని గొణుక్కుంటావు! నీరోగం వొదిలిస్తానుండు-(నెత్తిపైఁగొట్టును)

సక్కు—(భక్తిపారవశ్యమునపాడుచు మూర్ఛనందును)

అత్త—అయ్యో! అయ్యో! ఇదేం అఘాయత్యమర్రా! దెబ్బయేమైనా ఆయువుపట్టున తగలలేదుగదా! నాయనా! కాశీ! కాశీ! తొందరగా రారాబాబూ! ఈపాపిష్టిముండ కొంపదీసింది. తొందరగా రారాబాబూ! అయ్యో! నాయనా! నారాయణమూర్తీ! నా కొంపకు శనిలాగ యీదిక్కుమాలిన కోడలెక్కడ దాపరించిందిరా తండ్రీ!—

(కాశీపతి త్వరితముగ ప్రవేశము)

కాశీ—అమ్మా! ఏమిటంత హడావిడిగా పిలుస్తున్నావు? (సక్కుబాయినిచూచి) ఇదేమిటమ్మా! ఇది యిట్లా పడిపోయిందేమి?

అత్త—అదేరానాయనా! అదేవొచ్చినపుట్టిముణక! ఈజెష్టపెద్దమ్మనెప్పుడు చేసుకున్నామో, అప్పుడే మనబ్రతుకు అల్లరిపాలయిందిరాతండ్రీ! ఓసిదిక్కుమాలినదానా! పోలీసులో—బొగ్గులో—మామీదికి, ఏయల్లరి తెచ్చిపెడతావే! సక్కూభూతమా!

కాశీ—ఉండవమ్మా! నీయల్లరి అఘాయత్యమైపోను. జరిగినసంగతేమిటో చెప్పకుండా ఏక వొక్కటే గడబిడ—పైత్యమోఅం

డలో -గాలో గడ్డలో-

అత్త—పైత్యంగాదు; దానిశార్థం- ఇంట్లో చాకిరీఅంతా ముసలి ముండని నామీదపడవేసి, యీమూలకొచ్చి సంగీతాలుదీస్తూ వుంటే-"ఏమిటేయీదీ"అని అడిగితే మూగముండలాగమాట్లాడిందిగాదు. నెత్తిమీద మునివేళ్ళతో యిట్టేఅన్నాను. చచ్చినట్లు నేలమీంద పడ్డది.

కాశీ—ఆదెబ్బ యెక్కడైనా ఆయువుపట్టున తగలలేదుగదా! చెవులు మూసి నెత్తిమీంద నీళ్ళయినాచల్లితే బాగుండును.

అత్త—అసలు దెబ్బతగిలిందెక్కడరా? మాడుపట్టున మునివేళ్ళతో ముట్టుకున్నానో లేదో అంతలోనే విఱుచుకొపడ్డది. అన్నీదొంగ వేషాలూ-గడుగ్గాయిచేష్టలూ కాకపోతేనూ-

కాశీ—(చెవులుమూసి తలపైనీళ్ళుచల్లి) సక్కూ! సక్కూ!

సక్కు—(మెల్లగా తనలో కన్నులువిప్పకయే) రంగా-రంగా-రంగా-

అత్త—రంగా కాదు రాళ్ళు—చూశావటాశ్రీకాశీ! ఎన్నిగడుగ్గాయి వేషాలు వేస్తూవుందో! చచ్చినట్లల్లా ఎంతసేపు పడుకుంటావు? ఇఁకలే! ఎంత్కైన తగుదువే నాతల్లీ!—రంగా రంగా అట! ఎవఁడే ఆరంగడు! నీఱంకుమగఁడావాఁడు?

సక్కు—(లేచి) హా! రంగా రంగా! పాండురంగా! ఎంతటి నిందా వాక్యముల నీపాపాత్మురాలిచెవిని వేయుచుంటివి! అత్తగారూ! పండరినాధుఁడగు నాశ్రీరంగధాముఁడు నాకేయననేల? సమస్త జగజ్జాలమునకును భర్తయే!-

గీ॥ ప్రకృతి జనితమైనట్టి జీవప్రకాండ
మెల్ల కాంతామయంబు; సర్వేశుఁడొకఁడె-
భువన భరణైక పూరుష మూర్తియగుచు,
నీజగంబును తానె భరించునమ్మా! ॥ 3

అత్త—అయ్యో! అయ్యో! దీనికేం పోయేకాలం పుట్టిందిరో నాయనా? దీనివేదాంతంముండ! లోకానికంతటికీ వొక్కఁడే మొగుడంఘాంది. కుడుం మొదలుకొని గుండ్రాయిదాకా, అన్నిటినీ వొకటేకట్టగడుతూవుందేమిట్రా!—లోకంలో ఆడవాళ్ళనీ, మగవాళ్ళనీ లేనేలేరట! దీనికీ, నాకూ, నీకూ, అందఱికీగూడా, దేవుడు మొగుడట!—దీనిదేవుడు దిబ్బలై పోను!

సక్కు—హరిహరీ! అత్తగారూ! అకారణముగ, భగవద్దూషణము గావించి, అతితరఘోరపాపకూపమున నేలగూలెదరు?

కాశీ—అమ్మా! దీనికేమైనా పిచ్చాయేమిటే?

అత్త—వట్టిపిచ్చికాదురా! మదపిచ్చి!—

కాశీ—కొంపలో కాపురంజేస్తూవున్న సంసారిముండకు మదపిచ్చేమిటే! నీదంతా మహావిడ్డూరం!—

సక్కు—అత్తగారూ! నాకు పిచ్చియని వారుపల్కినది కొంతవఱకు సత్యమే! ఏమందు రేని—

గీ॥ పరమమై నిర్మలంబైన, పాండురంగ
భక్తియనియెడు, పిచ్చిలోఁ బడినదాన
ఎన్నటికినైన నాపిచ్చియే శరణ్య
మట్టిపిచ్చి మీకునుగల్గ నభిలషింతు. ౮

అత్త—ఆఁ—ఆఁ—చూశావట్రా! చూశావట్రా! ఎంతమాటంటూందో! దీని మదపిచ్చిముండిపోను! మనకందఱికీగూడా తనలాగే పిచ్చెత్తిపోతే సంతోషపడుతుందట! దీనిసంతోషం చట్టుబండలుగానూ! ఇదిగో! నాయనా! కాశీపతీ! నువ్వేమో వట్టి నోరు మెత్తనిసన్నాసివి! అదేమో—మదపిచ్చిముండ! ఇట్లాగే, నువ్వూ నేనూగూడా, నోరుమూసుకుని దీనిఆటలు సాగనిస్తి

మట్టామెనా—ఏరాత్రో—ఏపగలో—యిది కొంపలోంచిగూడలేచి చక్కాబోతుంది! మనకందరికీ, అప్రతిష్ఠ దీసుకొస్తుంది! వెంటనే, దీనికేదోవొక ప్రాయశ్చిత్తం చేసి, యీవెఱ్ఱి అణచకపోతే మిగిలిపోయినతరువాత మిడికిన లాభమేమీలేదు! పెద్దముండను. నేను చెపుతున్నానువిను.

కాశీ—అమ్మా! ఐతే, యీపిచ్చికి పరిహార మేమిటంటావు?

అత్త—పరిహారమా! నేనేదో, ఆలోచించి, తగిన సలహాయిస్తానుగాని, అందాకా, దీన్ని కొంపలోంచి కదలనియ్యకుండా, వీధిమొఖం చూడనివ్వకుండా వెయ్యికళ్ళతో కనిపెట్టివుండాలి!

కాశీ—దానిమొహం! ఇప్పుడుమాత్రం ఎక్కడికి వెళుతూందమ్మా! వట్టి చాదస్తపు పెద్దమ్మగాదటమ్మా!

అత్త—ఓరి తెలివితక్కువపెద్దమ్మా! ఇన్నాళ్ళనుంచీ దీనిలక్షణాలన్నీ చూసుకుంటూ, చివరకు ఇదా నువ్వు కనిపెట్టింది! అందుకే నిన్ను చవటపీనుగనుజేసి, ఆపెద్దమ్మతల్లి నిన్ను రెండుచెవులూ పట్టుకుని ఆడిస్తూంది! అయ్యయ్యయ్యో! ఇంతమందమతివై పోయినావేమిరా? అది చాదస్తపుపెద్దమ్మటరా! నువ్వుచాదస్తపు పెద్దమ్మవు; నేను చాదస్తపుపెద్దమ్మను! అంతేకాని అదెక్కడి చాదస్తపుపెద్దమ్మరా! కొంపలుగాల్చే కొరివిరా నాయనా!—మనకొంపకుజేరిన మహామారిరా బాబూ! ఆచాదస్తమే, మన హాతమారుస్తూందిరా కొడుకా!—తెలివితక్కువఆలోచనలుచేసు కుంటూ—ఇది ఆడిందిఆటా—పాడిందిపాటా, సాగనివ్వబోకురా సన్నాసీ!

కాశీ—అబ్బ! అట్లా కొప్పడతావెందుకే అమ్మా! నేనుమాత్రమేమ న్నానే! అదికొంపలోంచి లేచిపోతే నాకుమాత్రం సంతోష మటమ్మా! ఈరోజునుంచీ చూస్తూవుండు! నాతడాఖా! వీధి

గుమ్మం తొంగ్గి నాచూడనిస్తానేమో—(సక్కునుచూచి) వసే! మొద్దూ అట్లా నిట్రాతిలాగు నిలవబడి, తెల్ల మొగంవేసుకుని తెల తెలపోయి చూస్తావెందుకే! పద! కొంపలోకి—ఇక్కడనీకేం పని! ఇంట్లోచాకిరీ యేమీలేదు? ఈసారి వీధిగుమ్మంలో, అడుగు బెట్టిచూడు! కాళ్లువిరగబోడుస్తానోలేదో! "దేవుడూదయ్యం" అనివాగిచూడూ దెబ్బలుతగులుతాయోలేదో! సన్యాసులనీ, చట్టుబండలనీ, బిచ్చంబెట్టిచూడూ చంపుతానోలేదో! నడవ్వేమి యింకా!—

సక్కు—(నడచుచు) పాండురంగా! కృపాంతరంగా! నీ మహిమలు పరమాశ్చర్యకరములుగదా తండ్రీ!—

సీ॥ వితరణం బొనరింపఁ బ్రీతిగల్గెడు దాత,
కొకకాసయిన చేతనుండనీవు-
భూరిధనాఢ్యులై పోషింపఁగలశక్తి
గలుగువారికి సంతు గలుగనీవు-
ధనసంతతులుగల్గు దంపతులైన ని
ద్దఱికానుకూల్యంబుఁ జెఱతువీవు-
అధిక పాపాత్ముల కభ్యుదయంబు, స
జ్జనులకు నాశంబు సలుపుదీవు-
పాండురంగ! నీ ప్రియభక్తవరులనోట-
నీ భజనసేయగల స్వేచ్ఛనేని యొసగ
విట్టిపరమాద్భుతక్రీడ లేవిధాన
నీ మదికి మోదమును గూర్చునో మహాత్మ!— ౨

అత్త—ఈపిచ్చిగోల బెట్టవొద్దని ఎన్నిసార్లుచెప్పినా—మానవుగాదూ మానవుగాదూ! (కొట్టును)

సక్కు—హా! పాండురంగా! పాండురంగా!-

(అందఱును నిష్క్రమింతురు.)

— (జ్ఞానయోగి, శిష్యులతో ప్రవేశము.) —

జ్ఞాన—నాయనలారా! పరమ సాధ్వీమతల్లియు—పాండురంగభక్తిశీలయు-
పరమపావన సాధుచరిత్రియు నగు సక్కుబాయి యనుభవించు
చున్న కష్టపరంపరలను దిలకించితిరిగదా! ఆహాహా! ఆతల్లి
పాదకంజాతములను భజించిన వారిపాపసంతతులెల్లఁ బటాపం
చలై పోవునుగదా!—

సీ॥ అత్తగారెంత గయ్యాళియైనను, నామె
సేవలం, దరమరసేయఁబోదు;
తల్లి భయంబున తన్నుదండించు స్వ
కాంతుని దైవంబుఁగాఁ దలంచు;
భగవద్భజనతోడపాటుగాఁ దనయింటి
పనులనన్నిఁటిఁదీర్చు భక్తిమీర—
దూషణభూషణాదుల సమానంబుగా
భావించు-నిర్మల భావమొప్ప-
రంగని జపింప నాశఁజెలంగు వాక్కు,
రంగనిం గను కోర్కె మెలంగు దృక్కు,
గలుగు సక్కును దర్శింపగలుగువారు-
బహుపునర్జన్మరహితమా పదవిఁగనరె!— ఉ

1 శిష్యు—గురువర్యా! ఇట్టి పరమపుణ్యస్వరూపిణి కిట్టి బాధాపరం
పరలుగలుగనేల?—పాండురంగఁడంత భక్తరక్షణాసక్తిదూరుఁడా?

జ్ఞాన—నాయనా! ఇదియా నీసందేహము?

సీ॥ దేశసంరక్షణదీక్ష మహాత్ములు
కారాగృహంబుల గాసివడరె!—
అఖిలంబు రామచంద్రార్పణంబను రామ
దాసులు మ్లేచ్ఛబాధలను గనరె-
మతధర్మములకయి, ప్రతినఁదాల్చినయేసు
చరితులైననుగాని కొరతవడరె?
సత్యవ్రతావనా సక్తిగల్గిన చక్ర
వర్తులు శ్వపచసేవకులుగారె?
నిష్ఫలాకాంక్షకర్తవు నీవయంచు
నెంచుభక్తుల శ్రమల శోధించుచుంట,
యీశ్వరుని నెమ్మనమున కభీప్సితంబు
పుడమిలో భక్తులే శ్రమపడెడువారు.

2 శిష్యు—స్వామీ! అట్లయిన నీకష్టములెన్నినాళ్ళు? సక్కుబాయి జీవితము కష్టములతో తెల్లవారవలసినదియేనా? సత్కాలమా భక్తురాలికెన్నటికిని రాదా?

జ్ఞాన—వెఱ్ఱివాఁడా? అత్తగారుపెట్టుచున్న కష్టములు ప్రాకృతజనులకు కష్టములే కావచ్చును గాని పరమశాంతాత్మురాలగు సక్కుబాయికిప్పుడుమాత్రము సత్కాలముగాదా? దూషణ భూషణ తిరస్కారములు, నశ్వరదేహమునకేకాని వినశ్వరమగు నాత్మకుఁ గాదని యెఱింగినవారే జ్ఞానులు! అట్టియుద్దేశ్యముతోడ ఈకష్టములనెల్లనోర్చి భవాంబుధిని తరించినవారే భక్తశేఖరులు! వారియందీశ్వరు సదాప్రసన్నుఁడై అభేదప్రతిపత్తిని గల్గియుండు నని యెఱుంగుఁడు!—మనము శీఘ్రముగాఁ జని యింకనా పుణ్యాత్మురాలి దివ్యసందర్శన లాభమునఁ గృతార్థజన్ముల మగుదము రండు!

శిష్యులు—చిత్తము.

(అందఱును, నిష్క్రమింతురు.)



2వ రంగము—కాశీపతి యింటిలోని చావిడి)

ప్రవేశము—(ఒంటరిగ, కాశీపతి అటునిటు దిరుగుచు)

కాశీ—(స్వగతము) ఏపనిచేతామన్నా తోచదు. ఏది ఆలోచింతామన్నా మనస్సు నిర్మలంగా వుండదు. ఇరవైనాలుగుగంటలూ, మనస్సులో ఏమిటో—దిగులు దిగులుగా-గుబులు గుబులుగా-నల్లులు కుట్టినట్టూ—దోమలుకఱచినట్టూ—చీమలుపాకినట్టూ వుంటుంది. కొంపలో వ్యవహారమంతా యీవరసగావున్నప్పుడు—నాకేకాదు, ఎవఁడికిమాత్రం ఏందోస్తుంది! ఎవఁడి మనస్సుమాత్రం ఏం నిర్మలంగావుండి యేడుస్తుంది! మాఅమ్మ లక్షణం చూద్దామా అంటే ఆవిధంగావుంది! దీని లక్షణం చూద్దామా అంటే—యీవిధంగావుంది! మాసక్కుబాయికి అస్తమానమూ—దేవుళ్లూ దయ్యాలూ, జపాలూ తపాలూ—మాఅమ్మకు అస్తమానమూ—అవెన్నీ మానుకోవలసిందని, దాన్ని సణగటం గొణగటం సాధించటం, కొట్టటం నాకు వీళ్ళిద్దఱినీచూచి కుళ్ళి కుళ్ళి లోలోన కృశించియేడవటం - ఇవ్వీ మాపనులు—"పోనీ, ఆవిడగారు యింటికైన పెద్దది—ఆమెకిష్టంలేనిపనులు నువ్వెందుకుచేస్తావే" అంటే, అది వినదు. "ఇంటెడుచాకిరీ గొడ్డువలె చేస్తూనేవుందయ్యేను; అదియే బొమ్మలకు మొక్కితే నీకెందుకు—ఏపాటలు పాడుకుంటే నీకెందుకు నువ్వయినా వూరుకోరాదఁటమ్మా" అంటే, మాఅమ్మవినదు. వీళ్లిద్దఱినడుమా అడకొత్తులో పోకచందంగా నేను నలిగిచస్తు

న్నాను! మాఅమ్మ దానిమీఁది నేరాలు నాతో చెప్పుకుం టుంది. అది తనక్షోభంతా పాండురంగఁడితో చెపుకుంటుంది. నేనెవఁడితో చెపుకునేది! నాదుఃఖం వినేవాళ్లెవరు? ఐనాగానీ, మాఅమ్మకు, యింతపట్టుదల వుండటమనేది ఎంతమాత్రం నామనస్సుకు నచ్చుటలేదు. పాపం సక్కుని మాఅమ్మ కొట్టే దెబ్బలుచూస్తే, నాకేకడుపుతరుక్కుపోతూవుంటుంది! ఎవరైనా నమ్మతారోలేదోకాని, ఒక్కొక్కప్పుడు ఆదెబ్బలుచూచి, దుఃఖంఆపుకోలేక, చాటుకుపోయి, ఒంటరిగాకూర్చుండి నాలో నేనే, ఆకడుపులోగుబులు అణిగేపర్యంతరం, ఆడుదానికన్నా అన్యాయంగా ఘోడు ఘోడుగపడ్చి మళ్లీయెవళ్లైనాచూచి నవ్విపోతారని కళ్లుతుడుచుకొని బయటికొస్తూవుంటాను! అన్నిదెబ్బలు తింటుందా—అదెక్కడి వజ్రశరీరమో—అమ్మా అనదుగదా—అబ్బాఅనదుగదా—కంటతడిబెట్టుకోదుగదా— అంటేగింటే—"పాండురంగా" అనడం—లేకపోతే మళ్ళీ "అత్త గారూ" అని పిలవటం—ఆపిలుపులోనైనా వొక ఆగ్రహముం టుందా? ఆక్షేపణవుంటుందా? అతిభక్తి—అతిగౌరవమున్నూ— తెల్లవాఱుజామున నిద్రయేమి లేస్తుందో—అంతే, మళ్లీ నడి జాముపఱకూ, ఒక్కవిధంగా, వంచిననడుము ఎత్తకుండా ఇం టెడుచాకిరీ గొడ్డువలె చేస్తుందిగదా! ఈపని కష్టమనడ మున్నదా? ఆపని సుఖమనటమున్నదా? ఈపని రోతఅనట మున్నదా? ఆపని ప్రీతి అనటమున్నదా? చిన్నమొదలుకొని పెద్దదాకా, అన్నిపనులూ సమానమేకదా! అంటే మాఅమ్మ అగ్నివర్షం కురిపిస్తుందిగాని, ఇటువంటికోడలు ఆవిడ కెన్నిజన్మా లెత్తితే లభించను! ఇట్లాంటి అమాయకురాలిమీఁద, ఇట్లాంటి విధేయురాలిమీఁద, యింతకార్పణ్యం ఆవిడగారి కెందుకో, నాకేమీ తోచకుండావుంది? చాకిరీ చేస్తూచేస్తూ అది యేపా

టలు పాడుకుంటే యీావిడకెందుకు? ఏబొమ్మలకు మొక్కు కుంటే, యీావిడకెందుకు? ఊరుకోగూడదూ! ఐనా—రామా కృష్ణా అనుకోవడం రంకా? భగవంతుణ్ణి పూజించడం పాపమా? మాఅమ్మకు బొత్తుగా మతిపోతున్నట్టుంది! తనమట్టుకు తనకు దేవుఁడూ దయ్యమూ శూన్యంగదా! ఏకాదశీ ద్వాదశీమాట ఎప్పుడో మఱచిపోయిందిగదా! అతిథీ అభ్యాగతీ అసలే నాస్తి గదా! ఎదురుతిరిగి దానికి పిచ్చేట! అందులో వట్టిపిచ్చిగాదఁట! మదపిచ్చేట! నేనేమైనా కాస్తదాన్ని వెనకేసుకొచ్చి మాట్లాడి తినా కఱచినంతపనిచేస్తుంది! ఇవెన్నీ సరేగాని—వారంరోజుల కొక్కసారైనా దాన్ని గదిలోకి రానివ్వదేంపాపం! నేను తనకు చేసిన నేరమేమిటో! రాత్రి అందఱిభోజనాలూ ఐనతరువాత నాలుగు మెతుకులుతిని, మాఅమ్మకాళ్లు పిసికి—నాకాళ్లు కూడా పిసుకుదామని ఆశకామాల్సును—వెఱ్ఱిముండ! పాపం దాన్ని పడకగది చాయలకే రానివ్వకుంటే ఏంబిసుకుతుంది నాగొంతుకాయ? అదేంపాపమో—మొదట్నుంచీ, మాఅమ్మ పేరుచెపితే, నాకు హడులే! హడులుగాకపోతే యీవేళ నాకధి కారమెక్కణ్ణుంచొస్తుంది! ఇనప్పెట్టె తాళంచేతులు, మాఅమ్మ మెళ్లో—ఇంట్లో అధికారం మాఅమ్మనోట్లో—వేరే ఏదైనా నౌఖరీఐనాయేడ్చి నాల్గుడబ్బులుతెచ్చి నా భార్యా నేను వేరు బడదామనుకున్నా మనకు వోనమాల తరువాత వొక్కక్షర మైనా ఢొక్కశుద్ధి లేదయ్యోను! ఉద్యోగానికీ మనకూ, ఊర్ధ్వ లోకానికీ, అధోలోకానికీ వున్నంత సమీాపమయ్యోను!— ఏగంగలోదిగేది!..................ఐనా—నేనిన్ని ఆలోచ నలు ఏమేమిటో వెఱ్ఱివెఱ్ఱిగా చేస్తున్నానుగాని—ఇంకోసంగతి గూడా అవశ్యంగా, ఆలోచించదగ్గదే!.........మాఅమ్మ యీనాటిమనిషిగాదు! వయస్సుమీరినమనిషి! వడితగ్గినమనిషి!

అనుభవంగలమనిషి! అన్నిసంగతులూ తెలిసినమనిషి! అటువంటి దానిమాట కేవలంగా కొట్టివేసి, భార్యేమంచిది అమ్మేచెడ్డది అని నే ననుకోవటం పాపంగాని మఱొక్కటిగాదు! మాఅమ్మ చెప్పినట్టు దీనికొకవేళ నిజంగా పిచ్చేనేమో! దానిఅందంజూచి, నేనే, తప్పుదార్ని బోతున్నానేమో! పిచ్చేకాకపోతే లోకంలో వున్న ఆడవాళ్ళ నింతమందిని చూస్తూవుంటాంగదా—ఎవత్తైనా—దేవుఁడన్నా దేవుఁడిగుడిన్నా ఏశుక్రవారంనాడో—ఏసాయంత్రంవేళో, దేవుడిగుళ్లోకి వెళ్ళటం దణ్ణంపెట్టో కొబ్బరికాయకొట్టో రావడం వుంటుందిగాని—పొద్దస్తమానం అదే స్మరణేమిటి? బొమ్మనొకదాన్ని చంకనెత్తుకొని, నారంగఁడా నాసింగఁడా అని దేవుళ్లాడటమేమిటి? అన్నందింటున్నా, ఇల్లలుకుతున్నా—ఆ పిచ్చిపిచ్చి పాటలు పాడటమేమిటి? వెఱ్ఱిముండలాగ ఆవేదాంతాలు కుయ్యటమేమిటి? ఎక్కఁడో తనకు దేవుడు కనబడుతూవున్నట్టూ—తనతో మాట్లాడుతూవున్నట్టూ ఆ వెఱ్ఱిఘోరణేమిటి?—అన్నీ అట్లావుండఁగా, అన్నిదెబ్బలు గొట్టినా నాటకపోవటమేమిటి? పిచ్చిబలం గాకపోతే, గుబికీ గుబికీ అంతంతదెబ్బలు కొడుతుందే మాఅమ్మ—నవ్వుకుంటూ మామూలుమనిషిలాగ ఎవళ్ళు దులిపేసుకొని తిరగ్గలరు ? అబ్బే! సందేహంలేదు—ఇది తప్పకుండా పిచ్చే—మదపిచ్చంటే నాకు నమ్మకంలేదుగాని, ఇది, ఏదోవిధమైన పిచ్చిమాత్రం గాకపోదు! మాఅమ్మమాటలు ఆలోచించకుండా కొట్టివెయ్య వలసినవిగావు! ఐనా పెద్దలు మాతృదేవోభవ అన్నారుగాని పత్నిదేవోభవ అనలేదుగదా!—అయ్యయ్యో! చక్కఁగా చదువుకున్నది! విచక్షణగా, ఇంట్లో పనిపాటలు చెయ్యగలది! అందానికా యీవూళ్లో ఆడవాళ్ళంతా బలాదూరు! అటువంటి

దానికీ........ఏమనుకుంటే కార్యమేముంది! దాని గ్రహచారమదీ! నాగ్రహచారమిదీ!

(తెరలో) కాశీపతీ! కాశీపతీ!

కాశీ—అదుగో! మాఅమ్మగారుబోలు పిలుస్తూంది! ఆఁ—ఆఁ— వొస్తున్నా— (నిష్క్రమించును.)



## 3వ రంగము—కాశీపతియిల్లు.

ప్రవేశము— { పిండి విసరుచున్న సక్కుబాయియు ప్రక్కగా, శ్రీకృష్ణ విగ్రహమును.

సక్కు—తండ్రీ! గోపాలకృష్ణా! నాముద్దులకృష్ణా!—ఈదినమున పాలేల కడుపారనారగింపలేదు? ఏదీ! నన్నుచూడనిమ్ము. అయ్యయ్యో! పట్టికడుపేడ్చుచునేయున్నదంటయ్యా! నాతండ్రీ! నీకడుపేడ్చిన, నే నేడ్వనాబాబూ చెప్పుము. బ్రతిమాలి యడుగుచున్నాను. పాలెందులకు త్రాగలేదయ్యా! నన్నేడ్పించుటకా! ముద్దులు మూటఁగట్టుచుండు నీమొగమెంతలో వాడిపోయినది! అంత యాఁకలి కోర్వలేనివాఁడవు నాపైకోపగించి పాలుద్రావ మానితివా? కాక, మీవ్రేపల్లెలో తల్లి యశోదాదేవి త్రాగించినపాల వలె రుచిగాలేవని త్రావమానితివా?—గోపకాంతలయిండ్లలో, దొంగతనముగా, నుట్లకెగఁబ్రాకి పొట్టనింపుకొనిన పాలవలె తియ్యనివిగావని త్రావమానితివా? పిడికెడుపిడికెడు మంటిముద్దలను గుటుక్కున మ్రింగువాఁడవఁటనే! నాతండ్రీ! నేను భక్తితో నిచ్చినపాలు నీ మృద్గోళికలపాటియైనను రుచిగానుండలేదా? శ్యామలాంగా! అయ్యయ్యో! అసలే నల్లఁగానున్న నీశరీరమున, కీ, మటికి మెక్కుడనంటెనయ్యా?—ఏమంటిలో పొరలాడి

వచ్చితివి బాబూ!—గొల్లపిల్లలతో, కోఁతికొమ్మచ్చు లాడితివా? తల్లియశోదమ్మను తంటాలుఁబెట్టితివా?—గొల్లపడుచుల కొంగులుబట్టిలాగి, పట్టుకొనవచ్చినచోఁ బారిపోయితివా? ఇన్ని యాగడములు—ఇంత మంకుతనము—ఇన్ని యల్లరిచేష్టలు—నీవు పుట్టక నేర్చుకొంటివా? పుట్టి నేర్చుకొంటివా? కొంటెకుఱ్ఱఁడా! ఈచేష్టలు నీకుతగునఁటయ్యా నాతండ్రీ!—కాకున్నను నీకు గారాబ మధికముచేసి, మాయమ్మ నిన్ను మితిమీరఁజేసినది సుమా!

సీ॥ గోపెమ్మ నినుఁబట్టి కొసత్రాఁటితోఁగట్టఁ
గాని—బల్మిని ఱోటఁగట్టదయ్యె!—
వల్లవకాంతలు మల్లెపూవులచెండ్లఁ
గొట్టిరి కొరడాలఁ గొట్టరైరి!—
కాళీయఫణిరాజు, కాళ్ళఁజుట్టెనెకాని,
గాటంపు విషమెక్కఁ గలుపఁడయ్యె—
నినుఁ దృణావర్తుండు నీలాంబరమునఁ ద్రి
ప్పెనుగాని, భూమిపై విడువఁడయ్యె;
నిన్ను దర్శించినంతనే నిఖిల జనులు,
ఫణులు పశుజాలమును భూతపంచకంబు,
వివశమతులయి గారాము వెట్టినారు;
ఎట్టి యింద్రజాలము ప్రయోగించినావొ!॥ ౮

(జ్ఞానయోగి, శిష్యులు, ప్రవేశము.)

జ్ఞాన—(దూరముననుండియే సక్కుబాయినిచూచి) వత్సలారా! జ్యోతిర్మయంబగు నాదివ్యమూర్తియే, మహాభక్తురాలును, పతివ్రతాతిలకమును నగు, సతీసక్కుబాయి! కన్నుల కఱవుదీర నాదేవి

మూర్తిని సందర్శించితిరా? చేతుల పాపమార నాసీమంతినీమ తల్లికి నమస్కరించితిరా? శ్రవణముల తృప్తివాయ నాసద్భక్తురాలి సూక్తిరత్నముల నాకర్ణించితిరా? నేటికిగదా మనజన్మములు చరితార్థతఁగాంచినవి! ఆభక్తశ్రేష్ఠురాలు భక్తిపారవశ్యమున, నేమిచేయుచున్నదియో తిలకించితిరా?

గీ॥ బాలగోపాల చిన్మూర్తి, రూపంబుగల్గు
ప్రతిమ, సతిప్రేముడి నిజాంకపాళిఁదాల్చి-
యమితభక్తిని ముచ్చటలాడునదిగో!
భక్తిసంధాయి యీసక్కుబాయి యెదుట'॥

1 శిష్యు—ఆహా! కన్నులుతెరిచె! జన్మసార్థకమయ్యె! నేడెంతటిపుణ్యదినమోకదా!—భక్తాగ్రగణ్యురాలా! ఇచ్చటినుండియే నీపాదపద్మముల, కనేకకోటి నమస్కారములు! (నమస్కరింతురు.)

శిష్యు—భక్తిపరవశతం జొక్కియున్న యోపుణ్యాత్మురాలా! నీకనంతకోటిప్రణామములు!—గురువర్యా! ఈ సక్కూ మహాసాధ్వి భక్తితత్త్వముం గాంచుచున్న మనకే తనువులు పరవశంబులగుచున్నయవి! గోపాలకృష్ణునియం దైక్యమైపోయిన యీమె యెంత పరవశురాలై యున్నదోకదా!

సక్కు—ఇంకను కన్నులు తెఱచుకొనియేయుంటివా నాతండ్రీ! నిద్దుర పోవూ! నిద్దురవచ్చుటయే లేదూ? ఔనుమఱి—నిద్రయెట్లు వచ్చును? పాలుత్రావక మారాము చేసితివిగాదూ! కడుపీవిధముగా నేప్పుచున్నప్పుడు కన్నులకు నిద్రయెట్లు రాఁగలదు! నేను చెప్పలేదూ? పాలుద్రావకున్న నాఁకలియగునని—ఆఁకలియైనచో నిద్రపట్టదని—నామాట విందువా నాతండ్రీ! ఐనను, నావెఱ్ఱియేకాని, నీకాఁకలి యగుటెట్లు? నిద్ర పట్టు టెట్లు?

గీ॥ నిఖిల కమలోదరాండముల్ నిండియున్న
బొజ్జలోపల నాఁకలి వొడముటెటులు?
సంతతము భువనావనాసక్తమైన
కన్నుదోయికి నిద్దుర గలుగుటెటులు?. ౧౦

జ్ఞాన—ధన్యోస్మి! ధన్యోస్మి! ఆహాహా! ఎట్టిపరమార్థవాక్యములు వినఁబడుచున్నవి!—

1 శిష్యు—గురుచంద్రమా! ఈ సతీమణి యెంతకాలమైనను తన్మయచిత్తమున నిశ్చలగడుపునని తోఁచుచున్నది! మనల నీమె యనుగ్రహించుటెప్పుడు?—

జ్ఞాన—నాయనా! నేనీదేవిదృష్టిని మనవంకకు క్షణములో నాకర్షించెదను—చూడుము—

(శిష్యులతో కలసి భజనచేయును)

(అనుబంధము 2.)

సక్కు—(నివినివిని ఆనందముతో తాళమువేసి) (స్వగతము) ఆహా! ధన్యాత్మురాలనైతిని! కొన్నిదినములకిందట నిట్టిదే మధురతర పాండురంగ సంకీర్తనమీ శ్రవణములకు సోకెను— నేఁడును, అదియేగానము! అదియేకంఠమాధుర్యము! ఆ పరమభాగవతాగ్రేసరు లెవ్వరో దర్శించి తరించెదఁగాక! (సమీపించి) ఓహో! ఎంతతేజోమయ స్వరూపము! భక్తివైరాగ్యములు రెండునుఁ గలిసి యీమూర్తిం దాల్చినవియా యేమి చెప్పుమా!

సీ॥ శుభఫాలమున ద్వాదశోర్ధ్వపుండ్రంబుల
నద్దినట్టులు, తీర్చిదిద్దినాఁడు,
మొగమునఁ దలపైన, మొదలంట నెరసిన,
శ్మశ్రుజటాబంధ సమితివాఁడు,

కటికు రుద్రాక్షలు కంఠభాగంబెల్ల
పేర్లుగానలమిన వింతవాఁడు,
ఒకచేత తంబుర యొకచే, చిఱుతలూని,
శృతితాళముల హంగు సేయువాఁడు,
జానువులపైనఁ గాషాయ శాటిదాల్చి—
రంగ రంగాయటంచు, నోరార, పాండు
రంగ విఠలుని భజనఁజెలంగు నితఁడు,
సిద్ధుఁడో—సాధ్యుఁడో—రాజశేఖరుండో!— ౧౧

మహాత్మా! పాండురంగని స్మరించుచు, భక్తి రసావతారులోయన తేజశ్శాలులరై వెలుంగుచున్న తమరెవ్వరై యుందురు? సిద్ధులా? సాధ్యులా? శివకేశవచతుర్ముఖులలో నొక్కరా? భూతలంబులకు మావంటి యజ్ఞానుల ననుగ్రహింప దయచేసిన నారదులా? తుంబురులా? ఎవ్వరు?

జ్ఞాన—అమ్మా! నేనంతటివాఁడనుగాను. ప్రాకృతమానవమాత్రుఁడను. పుట్టుకచే మాలవాఁడను. జనులందఱును నాయందలి ప్రేమచే నన్ను జ్ఞానయోగియని పిలుచుచుందురు!

సక్కు—స్వామీ! భక్తశేఖరులగు తమదర్శనమునఁ గృతార్థురాలనైతిని! ఆనాడు తమరొక యపూర్వమధుర సంకీర్తనముచేత భగవద్భజనం బొనరించియుంటిరి! అనుగ్రహించి యాగానమునే యింకొకసారి భజించి యీదీనురాలి కానందముం గూర్పవేడుచున్నాను.

జ్ఞాన—అమ్మా! భగవన్నామ సంకీర్తనమున కింత ప్రార్థనమేల? ఇదే, యాగానము నాకర్ణింపుము.

(శిష్యులు పల్లవి యందుకొనుచుండఁగా పాటపాడును)

(అనుబంధము 1)

సక్కు—(వినుచు పరవశురాలై వారితోఁగలసి పాడుచు నృత్యము చేయుచున్నది)

(అత్త ప్రవేశించును)

అత్త—(చూచి తత్తరపడి, ముక్తకంఠముతో) వరే! అబ్బాయీ! కాశీపతీ! ఇంకేముందిరా! ఇంకేముందిరా! మనకొంప నిలువునా నట్టేట్లో బుడుంగున మునిగిపోయిందిరారో! నాయనో!(సక్కు ను చూచి)ఎన్నిసార్లు నీనోట్లో గడ్డిబెట్టినా యింత బుద్ధిలేదేమేనీకు? ఇంత విడబడ్డావేమే—వీధిలోకి రావద్దంటే ఈ కోఁతిముండకొడుకు లతోఁగలిసి యీగంతులేమిటే? ఈఅల్లరేమిటే? (కొట్టును)

కాశీ — (ప్రవేశించి) ఈనడువీధిలో యీ గంద్రగోళమంతాయేమిటి ఈతాళాలేమిటి? ఈతప్పెట్లేమిటి? ఈగంతులేమిటి! ఈరంతు లేమిటి?—మాముండగూడా యీ పెంటపాటి బైరాగుల మఠంలోచేరిందీ? ఇందాకట్నుంచీ తిన్నగా చూడలేదు. బాగానే వుంది వరస!

అత్త—"బాగానేవుందివరస" అనుకుంటూ నిలవబడి చూస్తావేమిశ్రా? వాఁడు పచ్చపుదొంగముండాకొడుకురా? ఆ ముండకు మందో మాకోపెట్టి మనస్సువిరిచాఁడురా? దీన్ని లేవదీసుకొని పోఘు న్నాఁడురా! దాన్ని నాలుగూ వాణ్ణి నాలుగూ చావగొట్టి దాన్ని లోపలకీ, వాణ్ణి బయటికీ, సాగనంపవేమిశ్రా? నీయమ్మ కడుపుకాల!

కాశీ—ఎవఁడవురానువ్వు! ఎవఁడవురానువ్వు! (కొట్టఁబోవునట్లు మీఁదికి బోయి) నువ్వానాయనా! ఆహాఁ—మావీధికిగూడా దాపరిం చావా? ఈసారి పట్టపగలే ఆరంభించావూ? కనపడ్డఆడవాళ్ళ నల్లా లేవదీసుకొపోవటం మొదలుబెట్టావాయేమిటి! నిన్ను పోలీసులకప్పగిస్తావుండు! కాశీపతెంటే ఏమనుకున్నావో ఖబర్దా

రుగా తిరుగు!............వీఁడు దొంగముండకొడుకేఅమ్మా! ఆవేళ కామాక్షమ్మగారి పినతల్లింట్లో, కన్నంవేసినవాళ్ళు వీళ్ళు ముగ్గురేనే! మఱునాడు, పోలీసువాళ్లు వీళ్ళని పోలిసెట్టిసత్రంలో పట్టుకుని, ఠాణాకులాక్కుపోయి, చేయఁగలిగినంతఅల్లరీ, చేసి వదలిపెట్టారు! ఈమధ్య మళ్ళీ వీఁడెక్కడా ప్రజలకంట పడటం లేదు. ఇన్నాళ్ళకుమళ్లీ యీవీధిలో వెలిశాడు! మాలవాఁడు కూడాను—

జ్ఞాన—బ్రాహ్మణోత్తమా! తమరు పల్కినదానిలో నంతయు నసత్య ముకాదు. నేను కనకమునపహరించి, కాంత నపహరింపఁదలఁ చినమాట నిజమే! కాని, అవి, మీరుపల్కిన కనకముఁ గాంతయును మాత్రముకావు—అవి వేఱుగానున్నవి—

గీ॥ దొంగిలింపరాని రంగభక్తియనెడు
కాంచనంబు నపహరించినాను;
వ్యభిచరింపరాని యీ ముక్తికాంతనుఁ,
జేరి, సౌఖ్యమందఁ గోరినాను॥ ౧౨

అత్త—విన్నావషరా! విన్నావషరా! తానే చెప్పుకుంఘున్నాడు. ఇంకె క్కడో, దొంగతనాలు చేశాఁడష! ప్రొద్దునలేస్తే వీఁడి కిదేపని లాగ కనఁబడుఘూంది. ఇంకా కనిష్టీబుని పిలవ్వేమిరా? పిలవ్వే మిరా!

జ్ఞాన—అమ్మా! నిజముగా నాకిదియేపని! ఇంతకన్న నుత్తమకార్యమీ జన్మలకేమియున్నది?—

కాశీ—నీదిమఱీచాదస్తమమ్మా! దొంగ నేనుదొంగననీ చెపుతాఁ డఁటమ్మా! వాఁడు టక్కరివేషంవేసి, వేదాంతం ఏడుస్తు న్నాఁడు!

అత్త—దొంగముండకొడుకులకు, వేదాంతాలకేమితక్కువ నాయనా!

కాశీ—(సక్కు_నుచూచి) నువ్వింకా కొరతకుపాతిన స్తంభంవలె_అట్లా నిలుచుంటావెందుకే! అబిచ్చపుముండాకొడుకు మొహం తేరిపారా ఏం జూస్తావే! సంసారివిగావూ! సిగ్గులేదూ! పద— ఇంట్లోకి—పళ్ళురాలగొట్టఁగలను—( జ్ఞానయోగినిఁ జూచి ) ఏమిరా! దొంగా! అసలు పంచముఁడవుగదానువ్వు! బ్రాహ్మణవీధికెట్లా వొచ్చావురా? వచ్చినవాఁడవు—ఏమూలనుందో, కళ్ళుమూసుకుని దాఁటిపోక—నాయింటి కెందుకొచ్చావురా? నాపెళ్ళాంజోలి నీకెందుకురా? ఇంకాకదలవేం? పదిమందిబ్రాహ్మల్ని పిలిచి బడితెబాజీ చేయించమన్నావా? మెల్లఁగా చెఫ్తున్నప్పుడే విని, మెదలకుండా వెళతావా?

జ్ఞాన—అయ్యా! రూపొందిన భక్తితత్త్వము—అవతరించిన వైరాగ్య స్వరూపము— పతివ్రతలలో మేలుబంతి—అరిషడ్వర్గ శాత్రవ దేవతయగు, మాయి శ్రీసక్కు_బాయి, మనయందఱి యదృష్టవశమున, మీయింట వెలసియున్నదని యెఱింగి—దర్శించి, జన్మమును సార్థకపరచుకొన నాశపడి యిచటవచ్చితిని. జననిదర్శనమయ్యె—జన్మము తరించె_నేనింక వెడలిపోవుచున్నాను! ఆగ్రహింపవలదు!

కాశీ—నీయమ్మకడుపుకాల! మళ్లీ నాభార్యపేరెత్తుతున్నావెందుకురా? మాలవాణ్ణి ముట్టుకుంటే మైలబడతానని చూస్తూన్నానుగాని, మడమలు విఱుగబొడిచుందును! ఉండుండు! ముట్టుకోకుండానే, నీరోగం వొదిలిస్తా! (తిరుగలిదగ్గఱి ఱొండినిఁదీసి, జ్ఞానయోగి కన్నులలోఁ గొట్టును.)

జ్ఞాన—రంగార్పణం—శ్రీరంగార్పణం—శ్రీపాండురంగార్పణం—

అత్త—అదేమిటాౢ! అదేమిటాౢ! నీహడావిడిమండ! అరసోలెడుపిండి ఆవిధవమొహాన్ని గొట్టావేమిరా!_వీఁడికి ఇదిగాదురానాయనా

ప్రాయశ్చిత్తం నేనుచేస్తానుండరా! (లోనికిబోయి కలయంపిఁ దెచ్చి, జ్ఞానయోగి మొగమునఁ జల్లుచున్నది)

జ్ఞాన—రంగార్పణం! శ్రీరంగార్పణం! శ్రీపాండురంగార్పణం!— అమ్మా! పూజ్యురాలవగు నీ తిరుహస్తములతోఁ జల్లఁబడిన యీ కలయంపివలన, నాశరీరము పరమపవిత్రింబయ్యె! ధన్యోస్మి! ధన్యోస్మి!—

గీ॥ హరి చరణజాత—హరజటాభరనిపాత,
యగు సురాపగామాత పుణ్యామృతంబు,
విశ్వశుభదాత గోమాత విమలవిష్ఠ—
కలసి నను ధన్యచరితునిఁగా నొనర్చె॥ ౧౩

అమ్మా! నీకునమస్కారము! సక్కూమహాదేవీ! ఇటనుండియే నీపాదపద్మముల కనంత ప్రణామములు! ఇఁకనాకు సెలవు!

( అనుబంధము 2 )

(శిష్యులతో నిష్క్రమించును.)

కాశీ—పో! దొంగముండకొడుకా! పో! ఇంకొకసారి ఇంటిఛాయల కొచ్చావాలంటే, చచ్చావనుకో! గుండెల్లో నిద్రబోతా! జాగ్రత్త!—

అత్త—అబ్బబ్బబ్బ! ఎంతసేపటి కొదిలిందిరా శనిగ్రహం!—(సక్కునుఁ జూచి) ఏమే! పత్తికాయల్లాగ, గ్రుడ్లుమిటకరించి చూస్తావేమే! పిండివిసరవేతల్లీ అని చిలక్కుచెప్పినట్టు చెప్పి కూర్చోబెడితే— నీకేం పెద్దరోగంమొచ్చిందీ? గిన్నెడుగింజలూ గిన్నెలోనేవుంచి— వీధివెంటఁబొయ్యే అడ్డమైన దొంగగాడిదెకొడుకులతోటీ గలిసి తైతక్కలాడటమేనా నీకుపని? మగనాలివిగావూ? మర్యాదా— మానువం ఎఱుఁగవూ? భగవంతుఁడు అనుగ్రహించలేదుగాని,

పదిమంది బిడ్డలతల్లివి గాదగిన యీడొచ్చెనే! ఇఁక—నీకు, జ్ఞానమొచ్చేదెప్పుడు? ముత్యాలమ్మ సమర్తాడినప్పుడు—ఎన్ని దెబ్బలుగొట్టినా నన్నుగాదని అనుభవిస్తావు! నీయమ్మచచ్చి పోనూ! ఈరోజునుంచీ గుమ్మంలో అడుగుబెట్టవుగదా—బిచ్చపు విధవలతో ఎగురులాడవుగదా!—బుద్ధివస్తుందా? వస్తుందా?

(కొట్టును)

సక్కు—హా! పాండురంగా! పరాత్పరా!

అత్త—నీ పాండురంగఁడూ—నీపనీ—భగ్గున మండినట్టే వున్నైగాని ఇంట్లోకిపద!—చెపుతానీసంగతీ! నీదేవుఁడిసంగతీ— (కొట్టును)

సక్కు—(పోఁబోవుచు, విగ్రహము నెత్తుకొనును)

అత్త—అదుగో! అదుగో! అదే వద్దన్నపని! ఈపాడుబొమ్మలే నీకొంపా నాకొంపా తీస్తున్నవి! ఆబొమ్మనిటుతే! అవతల గిరవాటువేస్తే కాని నీవు దారికిరావు!—

[విగ్రహమును లాగుకొని పారవేయును.]

సక్కు—కృష్ణా! కృష్ణా! నాతండ్రీ! నన్నువదలిపోయితివా? నన్ను వదలిపోయితివా?—

అత్త—నోరెత్తితే నక్కీళ్ళువిరగబొడుస్తాననుకో!—(గెంటును)

(ఇద్దఱును, నిష్క్రమింతురు)

కాశీ—వట్టిపిచ్చిసన్నాసి! అయ్యయ్యో! ఎన్నిదెబ్బలు పడుతూందో!—మొద్దంటి మొగుణ్ణిబ్రతికి ఎదురుగావుండి, చూస్తూగూడా, ఏమీచేయలేకపోతున్నానుగదా! ఇఁక నాబ్రతుకెందుకు? ఇక్కడిదెబ్బలుచాలక, ఇంకాలోపల నీసంగతిచెపుతానంటూ లాక్కెళ్ళింది! ఏమైనాచెయ్యనియ్యి! దానికర్మం! నేనేంజేసేది?

ఎదురుగావుండిమాత్రం, దానికష్టంచూడలేను. గదిలోకెళ్ళి ముసుగుబెట్టుకుని పడుకుంటా!—

(నిష్క్రమించును)



## 4 వ రంగము—పండరీపుర దేవాలయము.

ప్రవేశము—శ్రీకృష్ణుఁడు, రాధామాయి.

(కృష్ణునిశరీరమునిండ పిండియు, కలయంపియు నుండును.)

రాధా—(పైటచెరఁగుతో కృష్ణునిదేహమును తుడుచుచు) నాథా! జగన్నాథా! ఏమి యీనైపరీత్యము? ఏమి యీవింత?—

గీ॥ పరిమళాగరుగంధ బంధురశరీర,
మింతలో, నింతదుర్గంధమొప్పుగాంచె?
ఘనశరచ్చంద్రచంద్రికా కాంతిమీఱు,
వదనమున కింతలోన నైవర్ణ్యమేమి? ౧౪

శ్రీకృ—దేవీ! అదియొక చిత్రమైనగాథ! చెప్పిన నవ్వుదువేమో?

రాధా—మీలీలలనువిని నవ్వనిగడియగలదా? చెప్పుడు!

శ్రీకృ—అగ్రహారమను పురమున నాయంతరంగభక్తురాలగు సక్కుబాయి యను పతివ్రతామణిగలదు. ఆమెను సందర్శింపవచ్చిన జ్ఞానయోగియను నాభక్తునిపై నాగ్రహించి, సక్కుబాయి భర్తయు—అత్తయు, నీపిండిని, కలయంపిని మొగమునఁజల్లిరి. అప్పుడాభక్తుఁడు, పాండు“రంగార్పణ”మని పల్కినకతమున, నాశిక్షను, నే ననుభవింపవలసివచ్చినది!

రాధా—ఆహా! మీభక్తవాత్సల్యమునకు మేర లేదుగదా!

# ప్రథమాంకము.

శ్రీకృ—దేవీ! నాభక్తవాత్సల్యముమాటకేమిగాని, సక్కుబాయికి నాయందుగల,యపారభక్తిమాత్రమునంస్తవనీయమైనదిసుమా!

రాధా—మీరు స్వయముగా స్తుతింపఁదగినంత దృఢభక్తిసమన్విత యగునా—ఆసక్కుబాయి?

శ్రీకృ—నీకు సందేహమేల? నాతో స్వయముగావచ్చి యొక్కమారామెను దర్శింపుము.

రాధా—భాగ్యము. [తెర]

ప్రథమాంకము.



# సతీ-సక్కుబాయి



## ద్వితీయాంకము



### 1 వ రంగము—కాశీపతియిల్లు.

పరివేశము—పిండివిసరుచున్న సక్కుబాయి.

సక్కు—రంగయ్యా—నాపాండురంగ విఠలమూర్తీ! అత్తగారు నిన్న నాలోనుండి వేఱుపరచి యెందో పారవేసినది. నిన్నటినుండియు నీకు, నివేదన శూన్యమయ్యెగా! నాతండ్రీ! నీకాఁకలియగుచున్నదా స్వామీ! అయ్యో! నేనేమిచేయుదును! పాపాత్మురాలను' నిన్ను నాదగ్గఱ స్థిరముగా నుంచుకొనుటకై నను స్వతంత్రము లేనిదాననైతిని! నీఁకు, నివేదనములేదని, నీతోపాటుగ, తిండిమానుటకన్న, నేను చేయగల్గినదేమియును లేకపోయెను. తిండి మానుకొంటిననియేగదా నాతండ్రి అత్తగారు ఉదయమున, నన్నన్ని దెబ్బలు కొట్టిరి!—రాత్రియంతయు కంటిమీఁద ఱెప్పవేయకుండ పిండి విసరితిని! ఈకుప్ప యింకను పర్వతమువలె నున్నది! ఎన్నడు తరుగును? ఎట్లు తరుగును?—మానవమాత్రుల కిది సాధ్యమైన కార్యమా?—ఐనను, దివ్యప్రభావ భాసురుండవైన నీ కనుగ్రహమున్నయెడల నన్ను రక్షింపలేకపోవుదువా?

సీ॥ అలనాడు సభలోన హాకృష్ణయనుకృష్ణ
మానంబుఁగావవే! మాననీయ!—

పాలపాపనిభ క్తి పాశంబులకుఁజిక్కి,
కంబంబునందునఁ గట్టువడవె!
గజరాజుమకరిచే—గాసిల్లినిను వేడ,
నక్రింబుఁ గూల్పవే చక్రధార!
పిడికెడు నడుకుల పేదకుచేలుని
మనుపవే! బహుళసంపదలచేత
ఆర్తులగు భక్తులను బ్రోతువనుచునీకుఁ
గంకణముగల్గదే! యకళంకమూర్తి!
మఱచితే? భక్తవాత్సల్యపరతనీవు
కష్టమా? చిన్నికృష్ణ! నాకష్టమార్ప. ౧౫

ఆపద్బాంధవా! నాయనా! నాపాండురంగమూర్తీ! నామొరాల కింపవా?—

ఉ॥ ధీరతరోపవాసమున, దేహబలంబుగతించె నిన్న నే!
హారము నీరముం విడచి నందుకుతోడుగ నిద్రలేదు; ని
స్సారతచే, కరంబులను జాలగ బొబ్బలుపుట్టె; నింకనే
తీరున పిండిసేయఁగల? తీరనిధాన్యపురాశి! శ్రీహరీ! ౧౬

అయ్యయ్యో! చేతులఁ బొడసూపినబొబ్బలు చిదికి నీరుగారఁ జొచ్చినవి? పుండ్లువడినచేతులతో నెట్లుతిరుగటిం ద్రిప్పనేర్తును?...... అమ్మయ్యో ఆవల కోడికూత నాశ్రవణముల కతిభయంకరముగా వినఁబడుచున్నది!—అత్తగారు నాశరీరముపై మోదిన కొరడాదెబ్బల చారికలవలె తూరుపుకొండపై తెల్లని చారికలు కనఁబడుచున్నవి! క్రోధఘూర్ణాయమానమగు నెఱ్ఱనిమొగముతో సూర్యదేవునితోపాటుగా మాయత్తగారును అరగడియలో నిఁక సాక్షాత్కరింపఁ గలదు. అరగడియకాలములో, అనంతమైయున్న యీ ధాన్యపురాశిని నేను విసరఁగలనా? అయ్యో! విసరకున్న నెట్లు? విసరనైన విసరవలయును! దెబ్బలతో నేను చావనైనఁ జావవలయు! చచ్చుటకు

భీతిల్లనుగాని, అత్తగారియాజ్ఞ నతిక్రమించినపాపమును మూటగట్టుకొని చావవలయునుగాబోలును! చేతులు బొబ్బలెక్కినను సరియే! మఱియేమైనను సరియే—శక్తివంచనలేక, సాధ్యమైనంతవఱకు నాదోషములేకుండ విసరెదఁగాక! [కొంతసేపు విసరి యలసటనంది] అబ్బా! గూడలు పడిపోవుచున్నవి! అరచేతులు మండిపోవుచున్నవి! కన్నులు మూతలుపడుచున్నవి! బడలికచే శిరస్సు గిఱ్ఱునఁ దిరుగుచున్నది!—ఇంకేమిచేయుదును!—పాండురంగా! ఆపద్భంగా! ఇప్పట్టున నీకన్న నాకుశరణంనాస్తి! నీపాలఁబడినదానను! ఏమిచేసినను నీదేభారము!—

మ॥ కరుణాంభోనిధి! అత్తగారును, మనఃకాంతుండు నేతెంచి, ని
ష్కారుణ్ గొడ్డునువోలె గొట్టెదరు కృష్ణా! నన్ను-నాజీవముఞ్
త్వరలోఁబాపి, త్వదీయ దివ్యపదముం బ్రాపింపఁగా జేయుమా!
శరణం నాస్తి యటంచు వేడితి పరేశా! భక్తచింతామణీ! ౧౭

[మూర్ఛిల్లును]

[రాధా కృష్ణులు ప్రవేశము]

కృష్ణు—దేవీ!— అదే నాభక్తురాలు సక్కుబాయి! భక్తిపారవశ్యమున, నెట్లు మూర్ఛాగతయై పడియున్నదో—కనులారఁ దిలకింపుము!

ఆ॥ మూఁడునాళ్ళనుండి భోజనంబు త్యజించి
యున్నదీ లతాంగి నన్నుఁగూర్చి-
పిండివిసరలేని బెంగ నిద్దురమాని
యుండి నను స్మరించుచున్న దిపుడు॥ ౧౮

రాధా—పిండి విసరఁజాలనంత మాత్రమున, నిద్రిగూడ మానవలసినంత బెంగ—యీమెకేలఁగలుగవలయును? అందువలన నీభక్తురాలి కెట్టిబాధయైనఁ గలదా?

కృష్ణు—బాధగలదాయని యడుగుచున్నావా?—

సీ॥ చుప్పనాతికి నగ్రసోదరి తాటక,
కెనయగా కలహావేత్త యీమెయత్త—
"దున్నయీనిన" దన్న దూడనుగట్టెద,
నేదీ?" యనెడు మూఢుండీమెభర్త—
పొద్దుండఁగాలేచి, యెద్దుపోలికనెంత
యీదినఁ దీరని యింటిపనులు—
కల్లనేరము లిచ్చకంబులకై నూరి
పోయువార లిరుగుపొరుగువారు—
సంతతము నన్ను స్మరియించు సక్కుబాయి,
చూచిమోదార్చువారు మచ్చునకు లేరు;
కష్టమేకాని, సతికి సౌఖ్యంబుగలదె?
సహనముల దీవిగాదె! యీసక్కుదేవి?॥— ౧౯

నిన్నటి సాయంకాల మీమె యత్తగారు, ఉపవాసముచే శుష్కించి నీరసించియున్న యీసక్కుబాయికి, ఇరువది మానికెల ధాన్యముం గొలిచియిచ్చి—నీవిని తెల్లవారుసరికి పిండి విసరుమని యాజ్ఞాపించినది!

రాధా—ఏమేమీ! ఇరువదిమానికల ధాన్యమా? పండ్రెండుగంటలలో విసరుటయా? మానవులకు సాధ్యమగునా యీపని!

కృష్ణ—పాపము గతరాత్రియెల్ల నిద్రమాని చేతనైనంతవరకు విసరినది. ఈభక్తురాలి చేతులు చూడుము. బొబ్బలెక్కి—చిదికి పుండ్లు వడి యెంతభీభత్సముగ నున్నవో!—అప్పుడే తెల్లవాఱవచ్చు చున్నది! అత్తయును భర్తయు, యమదూతలవలె నికవచ్చి పడి పిండివిసరలేదని యీమెను దండింతురు!—

రాధా—నాథా! భక్తురాలికింతటి మహాకష్టము ప్రాప్తించియుండఁగా— మీరింకనేల యుపేక్షసేయుచున్నారో నాకు విస్మయప్రదముగనున్నది!

గీ॥ తండ్రివైనఁ బ్రేముడిఁ గన్న తల్లివైన—
నెట్టిబాంధవులైన మీరే యటంచు,
భక్తి, నిను నమ్ముదురుగదా భక్తజనులు—
ఇట్లుపేక్షఁజేసిన వారి కేది దిక్కు?॥—

కృష్ణ—రాధా! నాహృదయమున కభిలాషం గూర్చుతత్త్వము నీకు సయిత మింతవరకు దురవగాహముగనే యున్నట్లున్నది. చూఁడుము—

గీ॥ పుటములనుగ్రాలు స్వర్ణంబుఁబోలె, సతత
కష్టతతులచే స్థిరభక్తి గల్గినపుడె,
భక్తులయశంబు ప్రళయంబువరకు నిలచు,
తరుణమెఱిఁగి, వారల యాపదలనుఁదీర్తు॥ ౨౧

ఈ సక్కుబాయికిఁగల్గిన స్వల్పకష్టమును నేనొక లిప్తమాత్రమున దీర్తును. ఈ చిత్రముం జూచుచుండుము!—(చేతితో గంపను తాకగా, ధాన్యమంతయు పిండియగుచున్నది.)

రాధా—(నవ్వి) జగన్నాటక సూత్రధారులగు తమరు సంకల్పించిన పిదప, జరుగని కష్టకార్యములుగూడ నుండునా? అమ్మయ్య! ఇప్పటికి సక్కుబాయి కష్టమును, నా హృదయాందోళనమును గూడ నణగిపోయినవి!

కృష్ణ—దేవీ! తూర్పుదిక్కునఁ బరికింపుము! అరుణోదయమైనది. అనతికాలముననే సూర్యోదయముగూడ కాఁగలదు. ఇంక సక్కుబాయి యత్తయు భర్తయు నిటకువత్తురు. భక్తురాలును మేల్కనును. మనమిఁట నుండరాదు. పోవుదము రమ్ము—

(ఇరువురును నిష్క్రమింతురు)

సక్కు—(ఆందోళనముతో మేల్కాని) కృష్ణా! కృష్ణా! రాధాకృష్ణా! పోబోకుము! దీనురాలను నీపాదదాసిని! నన్ను వదలి పోఁబో

కుము! రాధామాయితోఁ గలసివచ్చి రహస్యములాడుచుండిన వాఁడ వింతలో నెందుబోయితివి! నాతండ్రీ! నాకుఁగాన్పిం పవా? నేనేమి పాపముచేసితిని? అదిగో! అదిగో! ఇంకను నా శ్రవణములకు—సుధామధుర మధురమగు నీమురళీ నినాదము మెల్లని పిల్లవాయువులతోఁ గలసి వినఁబడుచునే యున్నది! నన్నాటలాడించుటకు, నన్ను శ్రమపెట్టుటకు, ఇందేయెందైన దాగియున్నావా?

సీ॥ మోహనంబైన నీమురళీ నినాద మ
ల్లదిగో! శ్రవణ పర్వమగుచునుండె;
పారిజాత సుజాత పరిమళోక్త సుగంధ
మల్లదిగో! మెలమెల్లఁదోచె;
శంఖచక్రాంకిత చరణ చిహ్నము లివే—
వచ్చిపోయినదారి వరుసఁజూపె;
నీతోడ ననుఁగూర్చి నాతల్లి యాడిన
పలుకులింకను చెవిఁబాయకుండె;
ఇంతలోపలనెందుఁ బోయితివితండ్రి!
పాపినగు నాదుకన్నుల బడవ? కృష్ణ!
క్షణములో, సత్యమగుదాని స్వప్నలీలఁ
జేసి, నీమాయచేఁ గప్పివేసినావె?॥ ౨౨

( అనుబంధము 8 )

(అత్త ప్రవేశము)

అత్త—ఓసి నీ యిల్లువల్లకాడుగాను! మూఁడురోజులనుంచీ కూడూ నీళ్ళూ లేకున్నా—ఎంతసత్తువతో ఎగురుతున్నావే? పుట్టిన బుద్ధి పుల్లలతోఁగాని, నిన్ను వొదిలేటట్టులేదేమీ? ఎన్నికొట్టినా, ఎంతగడ్డిబెట్టినా—నీకెందుకు బుద్ధిరాదూ అంటా!—పిండివిసి

రావా?—మొద్దువలె తెల్లపోయి చూస్తావెందుకూ?—ఎదీ? ఇదేనాపిండి? తిరగటిదెగ్గరపిండే కనబడదేం? ఇట్లాఎగుర్లాడుతూ వుంటే నీకు పిండివిసిరేతీరికెగూడా యెక్కడొస్తుందీ? (కొట్టును)

(కాశీపతి ప్రవేశము)

కాశీ—(స్వగతము) బంగారంవంటినిద్ర బండలై చక్కాబోయింది! తెల్లవాటిందోలేదో! అల్లటికి మళ్ళీ ఆరంభం—(ప్రకాశము) ఏమిటమ్మా! తెల్లవాటకముందే తిట్లుతింటూంది! ఏం జేసిం దేమిటి?—

అత్త—ఏం జేసిందా? నాపిండాకూడుజేసింది! తెల్లవాతేవరకూ, పిండి విసిరి సిద్ధంగావుంచమంటే, నామాట దాని పిక్కరోమంతో సమానంగా కట్టివేసి—మామూలుప్రకారంగా దానిఆటలేవో పాటలేవో యెగురులాడుతుంది! మూడు రోజులనుంచీ కూడు లేకుండా ఎగిరె గంతులెయ్యడానికి బలముందిగాని పిండి విసర డానికి బలం లేదూ?

కాశీ—[గంపలోచూచి] ఇదుగోనమ్మా! గంపెడుపిండీ విసిరిపెట్టింది! పాపం! విసరలేదంటావేం?

అత్త—ఎక్కడవిసిరింది? గంపెడుపిండి? ఏట్లో—(గంపనుచూచి) నిజ మేరా! ఇరవైమానికలపిండీ విసిరింది! ఇంతబలమెక్కణ్ణుం చొచ్చిందిదీనికి? దీనిసంగతంతాచూస్తే నాకు పరమాశ్చర్యంగా వుందే?

కాశీ—మటి—ఎట్లావిసురుతుందనుకుని ఇరవైమానికలపిండి విసర మన్నావమ్మా! పాపం తెల్లవారులూ మేలుకొని ఏదోవిధంగా విసిరి అక్కడబెడితే, ఆశ్చర్యంగావుందంటావు! విసరకుంటే దెబ్బలు తప్పవుగదా!

సక్కు—(స్వగతము) పాండురంగా! నీపరమాశ్చర్యలీల నీకే తెలియవలయుఁగాని—బ్రహ్మాదులకుసయిత మగోచరముగదా తండ్రీ!

అత్త—తెల్లవారులూ మేలుకుంటేమాత్రం అంతపిండి విసరటం సాధ్యమాతుందఁటరా?—అస్తమానం ఆటలూ పాటలతో ప్రొద్దుగడపుతూవుంటుందని తరగనిపని చెపదామని యిరవై మానికలు విసరమని ఊరికే అన్నానుగాని, నేనుమాత్రం విసరలేదని ఎఱుఁగనఁటరా! దీన్ని—ఏదోదయ్యం బట్టిందిరా! లేకపోతే, మూఁడురోజులనుంచీ కూడులేకుండా వుండటమేమిటి? ఇరవై మానికలపిండీ విసరమేమిటి? ఇల్లంతా ఎగురులాడటమేమిటి? తప్పకుండా దయ్యమేరా నాయనా! దయ్యమే! దీన్ని దయ్యం బట్టింది!

కాశీ—(అదరిపడి) అమ్మయ్యో! దయ్యమే? నిజంగా దయ్యమేనఁటమ్మా?

అత్త—దయ్యమేరా! దయ్యమే! నేను నీతో అబద్ధమాడుతానటరా నెట్టినాయనా!

కాశీ—నాకు దయ్యంపేరుచెపితే, తగనిభయమమ్మా! ఈదయ్యం కొంపలోంచి వొదిలేవుపాయం వున్నదా లేదా చెప్పు—లేకుంటే నేనీకొంపలో, క్షణమైనా వుండను. ఎక్కడికైనా పారిపోతాను!

అత్త—నువ్వు లేచిపోవడమెందుకురా? ఈదయ్యాన్ని నేనొకక్షణములో వొదలగొడతాను. చూస్తూవుండు!

కాశీ—ఎట్లా వొదలగొడతావు?

అత్త—గరిటెకాల్చి—నాలుగువాతలు వడ్డిస్తినా—దయ్యంగాదుగదా దయ్యం తాతగూడా వొదిలి చక్కాబోతుంది!

కాశీ—నిజంగాకాలుస్తావటే అమ్మా!

అత్త—కాల్చకుంటే యీదయ్యం వొదిలేదిగాదురా!

కాశీ—కాలిస్తే చచ్చిపోతుందేమో?

అత్త—ఎందుకుచస్తుంది? వాతలు దయ్యానికిగాని దానికి తగలవురా! నీకే గొడవలన్నీ తెలియవు' నువ్వూర్వుకో! అది చస్తే నాకుమాత్రం సంతోషమా నాయనా! దాన్నిబట్టినదయ్యం వొదలాలనే తంటాలుబడతానుగాని—

కాశీ—ఐతే నీయిష్టం! ఏదోవిధంగా దయ్యాన్నిమట్టుకు వొదిలిస్తేసరి— అదేనాకు కావలసినది!—

అత్త—ఎక్కడికిపారిపోకుండా దీన్ని జాగ్రత్తగా చూస్తూవుండు— గరిటె కాల్చుకొస్తాను! (నిష్క్రమించును)

కాశీ—(స్వగతం) అయ్యయ్యో' ఆసుకుమారమైన శరీరాన్ని నిజంగా కాలుస్తుందిగాబోలు'—నేనేంజేసేది?— (ప్రకాశం) ఇదుగో! నాకేసి అట్లా దయ్యపుచూపు చూస్తావెందుకు? శరీరంలో ఎట్లావుంది? నిజంగా దయ్యంబట్టిందా?—మాఅమ్మ అబద్ధాలాడుతుందా? నాతో నిజం చెప్పుమతీ?

సక్కు—[ఏడ్చుచు] అత్తగారితోపాటుగా, మీరును,నన్నుకాల్చుటకు సమ్మతించుచున్నారా?—నాకు దయ్యముపట్టినదనిన మాటను మీరుగూడ నెట్లు నమ్మితిరి? మీ రిరువురునుగూడ నొక్కటియై నన్ను పశువును గాల్చినట్లు కాల్చినచో—నిఁక నన్ను రక్షించు వారెవ్వరు? నామొరాలకించు వారెవ్వరు? [కాళ్ళపైఁ బడి] జీవితేశ్వరా! నన్నీ మహావిపత్తునుండి రక్షింపుఁడు. మీ పాదములే నాకుగతి! రక్షింపరా? రక్షింపరా?

కాశీ—[స్వగతము] ఇంతచక్కగా మాట్లాడుతూంటే—ఇంతకడుపు తరక్కుపోయ్యేటట్టు—ఏడుస్తూవుంటే—దయ్యం బట్టిందని యెట్లానమ్మేది? చూస్తూచూస్తూ మొద్దంటిదానికి, ఎట్లావాతలు బెట్టించేది? దీనిదుఃఖం చూస్తే నాకుగూడా దుఃఖమొస్తూంది!

సక్కు—నాధా! నాధా! మాటాడ రేమిపాపము? నాగతియేమిచెప్పితిరి? ఒకప్పుడుగాకున్న నొకప్పుడైనను, నన్నుఁజూచి రవంతజాలి పడువారు మీరొక్కరేకదా! అట్టి మీరును, నన్ను దిక్కు మాలినదానినిఁజేసి వదలివేయుదురా? ఇంక నాకు దిక్కులేదా? నాధుఁడుగల్గియు నే ననాధను గావలసినదేనా? పాండురంగఁడే నాకు శరణ్యుఁడా? ప్రపంచకమంతయు నన్నొక్కసారిగా శత్రు భావమునఁ జూచునా? అయ్యో! జీవితేశా! అత్తగారు వచ్చు వేళయైనది! నాప్రార్థనముం ద్రోసిపుచ్చితిరా? నన్ను వ్యధాచూచె దరా!—నేను మీయర్థాంగిని గానా! స్వామీ! పలుక రేమి?

కాశీ—ఇదిగో! ఊరుకో! ఛీ! ఏడవఁబోకు! కళ్ళుతుడవనా? (తుడు చుచు) నువ్వునాతో నిజమే చెప్పుతున్నావా? దయ్యం గియ్యం లేదుగదా? నిజమేనా?—ఐతేమఱి!—మాఅమ్మ అట్లా అం టుందేం?

సక్కు—అత్తగారట్లేల పల్కుచున్నారో నేనెఱుఁగను! నన్ను దయ్యము గాని భూతముగాని యేదియు నావేశింపలేదు!

కాశీ—ఒకటిగాదు—రెండుగాదు—ఇరవై మానికలే! ఏదయ్యమూ నిన్నావేశించకుంటే, ఒక్కరాత్రిలో, ఎట్లావిసిరావా అని మాఅమ్మకు సందేహం పట్టుకుంది! నాకూ అదే అనుమానం— ఏమంటావు? నువ్వే చెప్పు. సందేహంగావుండే విషయమంటావా కాదంటావా మఱి?

సక్కు—మీచరణసాక్షిగా ఆపిండియంతయు నేను విసరలేదు. చేత నైనంత విసరితిని— చేతులు బొబ్బలుపొక్కినవి! శ్రీకృష్ణా! నన్నెట్లు రక్షింతువో నీదేభారమని నీరసముతో తెల్లవాఱు జామున కొంచెము కన్నుమూసితిని! ఇంతలో రాధాసహితుఁడై శ్రీపాండురంగమూర్తి యిచ్చటికి దయచేసినట్లు స్వప్నము

వచ్చెను. కన్నులు తెఱచి చూతునుగదా నాకెవ్వరును గాన్పింప లేదు. పిండివిసరుట పాంగడురంగని మహిమయేగాని, నే నేమియు నెఱుంగను. మీరు నమ్మినను సరియే! నమ్మకున్నను సరియే! జఱిగినయదార్థమిది!

కాశీ—నీమొగంలే! ఊరుకో! దయ్యంలేదఁట! దేవుడొచ్చి పిండివిసిరి చక్కాబోయినాడట! ఎవళ్ళు నమ్మేకథలివి?

(కాలుచున్న గరిటతో అత్త ప్రవేశము)

అత్త—వరే! కాశీపతీ! త్వరగారారా! చేయికాలుతుంది! దానిచేతులు గట్టిగా పట్టుకో! వీపుమీఁద నాలుగు వాతలు వేస్తాను!

కాశీ—నిజంగానే కాల్చితెచ్చావఁటే? అమ్మా!—

అత్త—ఇంకామాట్లాడుతున్నావఁటరా! త్వరగాదాన్ని పట్టుకోరా! మళ్లీ చల్లారిపోతుందీ!—

కాశీ—అది పాపం దయ్యమూ భూతమూ ఏమీలేదని వొక్కమచ్చుగా ఏడుస్తూందేమే అమ్మా?

అత్త—దయ్యంబట్టినదాన్ని పట్టుకోని నీకు దయ్యం బట్టిందా అని గడ్డంకింద బెల్లంబెట్టి అడిగితే నిజం చెపుతుందటరా! అయ్యయ్యో! ఇంత అమాయకపు ముండావాడివేమిరా? శీఘ్రంగా కాల్చి వాతలుబెట్టకపోతే, యీపిశాచంకొంప వదలిపోతుందఁటరా నాయనా! నిన్నో నన్నో పట్టుకోని పీక్కొని తినటం ఆరంభిస్తే అనక అఘోరించలేమురా? త్వరగా దాన్ని పట్టుకోరా!

కాశీ—నిజమేనేవ్! నిజమే! నిన్నో నన్నో పట్టుకుంటే మనకు వాతలు వేసే దిక్కుగూడా కొంపలో మెవరూలేరు! ఇదుగో పట్టుకుంటున్నా! నేనుచూడలేను—మొగం అవతలికి బెట్టుకుంటాను గాని, నువ్వు వీపుమీఁద అంటించు—

(సక్కు చేతులుపట్టుకొని మొగమావలికి త్రిప్పుకొనెను)

అత్త—(వీపుమీఁద గరిటతో కాల్చును)

సక్కు—హా! పాండురంగా! రంగా! రంగా! (మూర్ఛిల్లును)

కాశీ—(సక్కునువదలి కేకలు గంతులువేయుచు) అబ్బా! చంపావుగదే చంపావుగదే! నీకేం పెద్దరోగం బుట్టిందే! దాన్ని కాల్చబోయి నన్ను కాల్చావేమే! నేనేంజేశానే! అమ్మో! నాయనో! మంట! మంట!

[క్రిందఁబడి కొట్టుకొనును]

అత్త—అయ్యో! నాతండ్రీ! నాతండ్రీ! నీకేమిబాధరానాయనా! నిన్ను కాల్చలేదురా! దాన్నే కాల్చానురా! నాచేతులు పడిపోనూ! ఎంతదుర్మార్గపుముండనైనా నిన్నుకాలుస్తానఁటరా! ఎక్కడరా నాయనా! నీకు బాధెక్కడరా తండ్రీ!

కాశీ—అబ్బా! అమ్మా! మంట! నఖశిఖపర్యంతం భగ్గున మండుకొపో తూందే! రాక్షసిముండవు! నన్నే కాల్చేవే! వీపుమీఁదచూడవే! అబ్బా! అయ్యో! అమ్మో!

అత్త—దాన్నిపట్టనదయ్యం చేసిన మాయరా యిది! నాయనా! నేను నిన్నెందుకు కాలుస్తానురా! అయ్యయ్యో! ఇదెక్కడి మాయ దయ్యం దాపురించిందమ్మో! మాకొంపలోకి—సక్కుబాయ మ్మతల్లీ! ఓ దయ్యాలపోతు పెద్దమ్మతల్లీ! నీమూలాన్ని నాకొడు కేడుస్తున్నాఁడు! లే అమ్మా లే! ఇఁకనైనా లే!—ఎక్కడరా నాయనా! బాధ! వీపుమీఁద విసరనైనా విసురుతానుండు!—

[వీపుమీఁద విసరును]

సక్కు—(లేచి) అత్తగారూ! అత్తగారూ! ప్రాణేశ్వరునకేమివచ్చెను? ఎందులకట్లు బాధపడుచున్నారు? నాధా! నాధా!-[సమీపించును]

అత్త—ఏం? పెద్దమొద్దులాగ, అత్తగారూ—అత్తగారూ అని చిలక

పలుకులు పలకొచ్చావు!—పో! పో! దయ్యాలపోతుముండా! దూరంగా బో!

సక్కు—అత్తగారూ! మీపాదములుబట్టి వేడుకొందును. నన్నెన్ని కొట్టినను సహింతును. భర్తగారి బాధనుఁగాంచి సహింపఁ జాలను! వారికేమైనదో కొంచెము చెప్పరా! అత్తగారూ! చెప్పరా? చెప్పరా?—

అత్త—ఊఁ—ఏమొచ్చిందా? నువ్వింకా ఎందుకుచచ్చావుగావని ఏడుస్తున్నాఁడు.

సక్కు—పోనీండు! వారు క్షేమముగానుండిన నాకంతే చాలును! నేను చచ్చుటకు సంశయింపను.

అత్త—అబ్బ! అబ్బ! ఎంతనంగనాచివే? నువ్వింతట్లోనే చస్తావా? అమ్మతల్లివి! మహామారివలె కొంపకు దాపురించావు! మా అందఱి ఆయువూ పోసుకొని వెయ్యేళ్లూ బ్రతుకుతున్నావు. నువ్వెందుకుచస్తావు! చస్తే మాశనే విరగడైపోవును.

సక్కు—అయ్యయ్యో! పాపాత్మురాలను. నాకు చావురాకున్నదిగదా! రంగా!

అత్త—అబ్బాయీ! అబ్బాయీ! ఎట్లావుందిరానాయనా?

కాశీ—అబ్బబ్బా! మంటమండుతూంది!

అత్త—విసరనా నాయనా?

కాశీ—ఎవరు? ఎవరదీ? అమ్మో! రాక్షసీ! నువ్వేనా? పో! పో! దూరంగా బో!—దాన్ని రమ్మను—సక్కును విసరమను—చల్లగా వుంటుంది—

సక్కు—నాథా! నాథా!—నేనువచ్చితిని! (విసరుచున్నది)

అత్త—నీతలపండుపగల! నీకేం మాయతెగులు ముంచుకొచ్చిందిరా? దాన్ని పట్టినదయ్యమే నిన్నూ పట్టిందఁటరా! నీకుగూడానాపాడ

గిట్టకుండా పోయిందఁటరా!—ఇద్దఱూకలిసి, కట్టగట్టుకుని గంగలో దిగండి! చావండి! నాకెందుకు? (ధుమధుమలాడుచు నిష్క్రమించును)

సక్కు—నాథా! నాథా! కొంచెము మంటతగ్గినదా ? చల్లనిగాలి వచ్చుచున్నదా ?

కాశీ—ఆఁ—చల్లగావుంది! బాధంతా మాయమైపోయింది! ఎవరు విసిరేది? నువ్వేనా సక్కూ ?

సక్కు—నాథా! నేనే!—శరీరమున మీకెట్లున్నది? ఈ మంటలేల గల్గెను? ఈభాధయెట్లువచ్చెను?—

కాశీ—నీకింకా తెలియనేలేదూ!—సక్కూ! ఎవరిపాపం వారినే కొడుతుందిసుమా! నీకు దయ్యంబట్టిందని, మాఅమ్మముండ నీకు వాతలు బెట్టబోయి నాకుబెట్టింది! గుడ్డిముండ!—

సక్కు—నాథా! అత్తగారు పాప మేపాపమునెఱుంగరు! అకారణముగ వారినేల దూషించెదరు? వారు నాకే వాతలుబెట్టిరి! నన్నే కాల్చిరి! ఆ వాతలవలన నాశరీరమునకు వేడియెంతమాత్రమును తగులలేదు! చందన లేపనమువలె చల్లగానుండెను. ఆబాధ మీకుగల్గుటయు పాండురంగని మహిమవలననేసుఁడీ! ఇంక మీకెట్టిబాధయుగల్గకుండ రంగఁడు మిమ్ము రక్షించుఁగాక!

కాశీ—అహాహా! నిజమేసుమా సక్కూ! నీమాట సత్యవాక్కుసుమా! ఆమాట నీనోటివెంటరాగానే, అంతబాధా—అంతమంటా—ఏమైపోయిందో, తుడిచివేసినట్లు మాయమైపోయిందిసుమా! ఆహా! రంగనిమహిమ!

సక్కు—స్వామీ! రంగని మనసారనమ్మినవారి కేకష్టములును గల్గవుసుడీ! మనకందఱకును రంగఁడేదిక్కు!

సీ॥ కాలకింకరులైన గడగడ వణకరే
పాండురంగని భక్తవరుల డాయ,
దావాగ్నియైన చందన శీతలముగాదె,
పాండురంగని భక్తవరులయెడల,
భూతపిశాచ సంభూతంబు వెఱవదే,
పాండురంగని భక్తవరులఁగాంచి,
మారీభయంకరా మయములు తొలఁగవే,
పాండురంగని భక్తవరులనుండి,
దారుణవిషంబయిన నమృతంబుగాదె,
పాండురంగని నిజభక్తవరులయందు,
రంగనామమువిూరు మంత్రంబు గలదె?
జగతి రంగనామాధికౌషధము గలదె? ౨౩

కాశీ—ఇన్నాళ్ళనుంచీ, రంగడిమహిమా—నీ మహిమా—తెలుసుకొనలేకపోయినాను. నీవు నా భాగ్యలక్ష్మివే సక్కూ!

(కౌగలించుకొనును)

(తెరవ్రాలును)



ద్వితీయాంకము.



# సతీ-సక్కుబాయి



## తృతీయాంకము



రంగము 1 — కాశీపతియింటి ముందువీధి.

ప్రవేశము—శంభుశాస్త్రి—(ప్రయాణవేషముతో)

శంభు—వీఁడిమీఁద బండబడ! వీఁడితో ప్రయాణమంటే ఎప్పుడూ యింతే! గంపెడుచీఁకటి నెత్తినవేసుకొని ఊరుదాటి కదిలి అవతల పడితే భోజనంవేళకు పదిక్రోసులప్రయాణమైనా సాగునా! అప్పుడే, తెల్లవాఱి సూర్యోదయంగూడా అయింది! ఇప్పటికింకా జాడా, జవాబూగూడా లేదు! సూర్యభగవానుడికన్నా తీరుబాటయింది గాని మాసూరిశాస్త్రిగాడికి తీరుబాటుగాలేదు! పండరీపురానికి మార్గం తెలియక, వీఁడితోడుకోసం ఆశపడ్డానుగాని—దారే తెలిసివుంటే యీపాటికి రెండుమూఁడు క్రోసులు తర్లిపోకుందునా? ఏమిటో—నాచాదస్తంగాని, యీమహాయాత్రరోజుల్లో—వేనవేలు యాత్రికులు వెళుతూవుంటే—ఎవరితో వెళితే కాకపోయింది! సూరిశాస్త్రి సూరిశాస్త్రి అని చూరు పట్టుకొని ప్రాకులాడడంకన్నా వెఱ్ఱితనముందా? ఇఁక ఆలస్యం చేసేవాణ్ణిగాను! మెల్లగా నడుస్తూవుంటా—తోడు—దాని సిగదరగా— అదేదొరుకుతుంది!......— అదుగో! ఎవరో వస్తున్నారే! సూరిశాస్త్రి కాఁడుగద!—

(పెద్దిశెట్టి ప్రయాణవేషమున ప్రవేశము)

పెద్ది—అదుగో! అదుగో! నాయిల్లు బంగారమైతే శెంబుచాత్తుర్లుగారు గామాల్చు! లాబాలే! లాబాలు! చాత్తుర్లుగారూ! దండాలండి!

శంభు—ఓహో! పెద్దిసెట్టిలాగున్నాఁడే!

పెద్ది—పెద్దిసెట్టిలాగుండటమేంటి? శాత్తుర్లుగారూ! పెద్దిసెట్టినే!—

శంభు—ఎందాకా ప్రయాణం! పెద్దిసెట్టీ?

పెద్ది—తమరెందాకా బాబు!

శంభు—ఎంతచెడ్డా షాహుకారుబిడ్డవనిపించావు! ఎదటిమనిషి గుట్టు తెలుసుకోకుండాచస్తే—నీగుట్టివ్వవుగా! పోనీలే! ఇందులో రహస్యంమాత్రమేముంది? నేనేచెపుతాలే! పండరీపురంలో జరిగే పాండురంగడి వుత్సవాలకు యాత్రవెళ్ళుతున్నాను. మరి నీప్రయాణ మెక్కడిదాకా?

పెద్ది—పండరిపురమే! ఐతే పదండిబాబూ! నాయిల్లు బంగారమైతే నేనూ పండరీపురానికే!

శంభు—ఓ! ఐతే యికనేమీ! నేను నక్కని దొక్కానన్నమాటే! కోమటిని వెంటనుంచుకుంటే, కోటిరూపాయలు వెంటవున్నంత ధైర్యం! యాత్రలో ఐదూ పదీ తక్కువబడ్డా నీయంతవాఁడి సాయముండఁగా నాకేంభయం!—

పెద్ది—సరిసరిలెండి! నాయిల్లు బంగారమైతే నన్నే నమ్ముకున్నారంటయ్యా! ఎట్టిచాత్తుర్లుగారూ! నాకాడ—నాకేడేముందిబాబూ! శెంబుచాత్తుర్లుగారు కనబడ్డారంటే—సగం బలమొచ్చినట్టయింది! ఎనక తమరింటో—బారచాలనాడు బట్టలు వాడుకున్న తాలూకు సిల్లర్లో కొంతైనా యీప్రయాణంలో సర్దకపోతారా అనుకుంటున్నా'—చానాళ్ళయింది. ఆ సిల్లరెనకపడే పోయింది. సదువుకునోళ్ళర్ని సీటికి మాటికి అడగటం బాగుండదని అడగ

లేదు. "ఇప్పుడుమాత్రం ఏంతొందరొచ్చిందని అడిగావుసెట్టీ" అని చెలవిత్తారేమో ఓయ్—ఏదో యాత్రప్రయాణంగదా అండి! డబ్బు నిక్కచ్చిరోజులుగదాండి! తమ రెఱగని దేముంది శాత్తుర్లుగారూ! కాస్తయాత్తర్లోమాత్రం యెనకటెసిల్లరబాకీ మాటకూంత గ్యాపకముంచుకొని, సెట్టినొక కంట గనిపెట్టాలి మఱి?—

శంభు—ఊహూం—అప్పుడే ముందటికాళ్ళకు బందం తగిలించావూ! ఎంతవాఁడవోయ్ సెట్టీ! పోనీ! నువ్వు నాకేమీ సర్దనక్కర లేదు గాని, ఆ పాతబాకీమాత్రం యాత్రలో వసూలుచెయ్యబోకు! నేను ప్రయాణపుఖర్చులుదప్ప అధికంగా యేమీ తేవటంలేదు-

పెద్ది—తమసిత్తం—నాబాగ్గెం—పోనీయ్యండిగాని, శాన్నాళ్ళయింది! అట్టే యెనకబడనియ్యబోకండి! యాత్తరనుంచిరాంగానేమాత్రం చుప్తాసేయించండి!

శంభు—పెద్దిసెట్టీ! పాండురంగా పాండురంగాఅని స్మరణజేస్తూయాత్రకు బోవలసిన సమయంలో పాతబాకీ పాతబాకీ అని ప్రాకులాడతా వెందుకూ? మనస్సంతా డబ్బుమీఁదేవుంచుకుని యాత్రకువచ్చిన ఫలమేముంటుంది?—

పెద్ది—ఫలాలకెక్కడికిలెండి? ఇదుగో! శాత్తుర్లుగారు! నాయిల్లు బంగారమైతే యవ్వారపు రహస్యమొక్కటి, సత్తెమైనమాట చెపుతానినండి, కోమటోఁడు తీర్తమెల్లాఁడంటే, భక్తికోసం, దేవుఁడికోసం మెల్తాఁడంటయ్యా! పదిదేశాలనుంచి పదిసరుకు లమ్మకాని కొత్తే—సొకబేరాన్ని సరకు దొరికితే అదే పదివేలని ఆపేచ్చ పడతాఁడు. అంతేకాని, ఆయువుమూడేటంత నిక్కచ్చికొస్తే నేతప్ప, దేవుఁడిగోలా దయ్యంగోలా మాకెందుకుబాబూ! సచ్చులిపాయలమ్ముకొనేవోళ్లం—

శంభు—భేష్! నిజమైనమాట జెప్పేశావోయ్! సెట్టీ! ఏటబడ్డకోమటి నష్టానబోతాఁడా అంటా రిదేకాబోలు!

పెద్ది—కబుర్లతో శే, తెల్లాఱింది! కాలుసాగనియ్యండి.

శంభు—మాసూరిశాస్తుర్లొస్తానన్నాడోయ్! ఇంకారాకుండా వున్నాడని చూస్తున్నాను.

పెద్ది—చూరిశాత్తుర్లా! ఆయన నెక్కడొస్తాఁడు! ఎయ్యేళ్ళపూజారి! వొత్తే యెనకొత్తాఁడులెండి. పదండి.

శంభు—ఉండుండు! ఎక్కడో—తాళాలు మద్దెళ్లూ చప్పుడువినపడు తూంది!—

పెద్ది—మనూరి భజనమేళంగాదంటయ్యా! అళ్లుగూడా పండార్పురమే ఎల్తున్నట్టుంది!

శంభు—ఐతే—ఆసమూహంతో కలిసిపోదాం! ఉండు—

(కొందఱుభక్తులు భజనసేయుచు ప్రవేశింతురు.)

( అనుబంధము 4 )

(సక్కుబాయి ప్రవేశము.)

సక్కు—(స్వగతము) ఓహో!—పాండురంగ నామసంకీర్తనము శ్రవణ పర్వముగా వినబడుచున్నది!

ఆ॥ పాండురంగభక్తి పారవశ్యమున "శ్రీ
రంగ! పాండురంగ! రంగ!" యనుచు,
భజనలందుమున్గి పండరీపురికేగు,
జనములెట్టిపూజ సలిపినారొ!— ౨౮

(ప్రకాశముగ) పుణ్యాత్ములారా! మీప్రయాణమెక్కడికి?

1 భక్తు—అమ్మా! పండరీపురమున శ్రీపాండురంగని దివ్యోత్సవములు

జరుగుచున్నవి! మేమాయుత్సవములను సందర్శింప నరుగు చున్నాము!

సక్కు—అయ్యా, నేనును మీతో పండరీపురికి రావచ్చునా ?

1 భక్తు—అమ్మా! అందులకు మా యాజ్ఞయెందులకు? భగవంతుని దర్శించుట కొకరియానతి కావలయునా? అవశ్యముగారమ్మ.

పెద్ది—చెంబుశాత్తుర్లంగారూ! ఈయమ్మ కాశీపతిగారిబార్య గాదం టయ్యా?

శంబు—ఔను. కాశీపతిభార్యే! సతీసక్కుబాయి! మహాభక్తురాలు!

పెద్ది—బక్తురాలోపాడో—అదెంతా కట్టిపెట్టనయ్యా! ఆమెలత్తగారు మా పెద్దది. ఈచక్కూబాయిని మనంతీసికెళ్ళామని వెలితే— బెమ్మరాకాసిలాగ మనలనందర్ని గొంతుకలు కొఱుక్కుస కొరుకుతుంది! మనకెందుకీగోల! పదండి—పదండి—గాలికి బొయ్యేకంప, కాలికిదగిలించుకుంటూ రెందుకు?—

1 భక్తు—అమ్మా! నీచరిత్రమేమో, ఆశ్చర్యకరముగానున్నది. మీ యత్తగారసాధ్యురాలంట! అకారణముగ నీకై యామెతో మాకు విరోధమెందులకు? మీయత్తగారి యాజ్ఞగైకొని నీవు రావచ్చును. మేము, మెల్లగా సాగిపోవుచుందుము.

(అనుబంధము 4)

(సక్కుబాయితప్ప, అందఱును నిష్క్రమింతురు)

సక్కు—(వైరాగ్యముతో, స్వగతము) హా! పాండురంగా! ఈ నిర్భాగ్యురాలికి, నీసందర్శనభాగ్య మీజన్మమున, ననుగ్రహింపవా?

సీ॥ గరుడధ్వజంబుతో, గగనమంటెడు నాల
యపుగోపురము దూరమందెకాంచి,
"పాండురంగా" యని ప్రణమిల్లి చంద్రభా
గాతీర్థముల నవగాహమంది,

అడుగడుగునకు "రంగా రంగ రంగా" య
టంచు సోపానములన్ని గడచి,
పటుకోటి సూర్యప్రభా మోహనంబగు,
త్వన్మూర్తి దివ్యపాదముల కెరగి,
భక్తిమేర మీర పారవశ్యమునంది,
తావకీన సన్నిధానమందె,
ప్రాణపంచకంబువదలి జీవన్ముక్తిఁ
గాంచుదివ్యపదవి గల్గుటెపుడొ? ౨౫

(జ్ఞానయోగి శిష్యులతో ప్రవేశము)

( అనుబంధము 5 )

సక్కు—(స్వగతము) ఏమినాభాగ్యము! మహాత్ముఁడగు జ్ఞానయోగీం ద్రుని దర్శనంబబ్బెను!—(ప్రకాశము) మహాత్మా! తమరును పండరీపుర యాత్రకే చనుచుంటిరా?

జ్ఞాన—అమ్మా! నిక్కము గ్రహించితివి! నేనును, పండరీపురమునకే చనుచున్నాను.

సక్కు—స్వామీ! ఈపాపాత్మురాలిని మీవెంటఁ గొనిపోవరా? శ్రీపాం డురంగవిఠలుని దివ్యసందర్శనము, చేయింపరా?

జ్ఞాన—అమ్మా—సర్వమును భగవదిచ్ఛానుసారము! దయచేయుము! దేవదేవుని దర్శింప సర్వజనులకును సమమైన యధికారము గలదుగదా!—.

సీ॥ ఇలలోన జీవుల కెల్లవారికి వాయు
సేవనంబునకెట్లు స్వేచ్ఛగలదొ!
పానీయములు సర్వమానవకోటికి,
తాగవనెట్టుల స్వాతంత్రంబుగలదొ!
సకలమానవులకు జ్ఞానామృతముగోరిలు
నదనున నేరీతి హక్కుగలదొ—

పరిజలకందఱకు, స్వారాజ్య సౌఖ్యంబుల
కిమ్మహినెట్టి స్వామ్యమ్ముగలదొ—
యట్టులే, లోకనాథుఁడౌ నాదిదేవు
భవ్య సందర్శన ధ్యాన భజనములకుఁ,
గలుగఁగలదట్టిదే యధికారబలము,
పెద్దలెల్లరు పెరుమాళ్ళపెండ్లి కనరె!— ౨౬

(అత్త ప్రవేశము)

అత్త—ఓరి నీశ్రార్థం చెట్టుకిందబెట్ట! ఓరి నీపిండాకూడు పిల్లులకుబెట్ట! మళ్ళీ మాకొంపకు దాపురించావురా!—ఓసి దిక్కుమాలిన దానా! ఓసి దరిద్రగొట్టు పెద్దమ్మా! నువ్వు సంసారివా? సానివే!—అబికారి వెధవతో వద్దన్నకొద్దీ గుసగుసలేమిటేనీకు—వరే! నాయనా! కాశీపతీ! మళ్ళీకొంపకు చేటుకాలం మూడింది రారోయ్!—నీభార్య వీడితో లేచిపోతూందిరోయ్! ఇంకేముందిరోబాబూ! ఇంకేముందిరోబాబూ!—

(కాశీపతి ప్రవేశం)

కాశీ—ఏమిటమ్మా!—ఎవఁడు? ఎవఁడొచ్చాఁడుమళ్ళీ? (జ్ఞానయోగినిఁజూచి) నువ్వేనటరా! నువ్వే? నువ్వేవొచ్చావూ? ఆరిదొంగ ముండకొడుకా!—ఏదైనా చేతికందితే ఎత్తుకపోవటానికొచ్చావా? క్రిందటిసారి మొహాన పేడనీళ్లు గొట్టించుకున్నది చాలలేదటరా? ఈసారి చెప్పుదెబ్బలు తగిలితేనేకాని నీకుబాగా బుద్ధిరాదు! గాడిదెకొడుకా!— ఏదే! అమ్మా! నాచెప్పెక్కడుందోచూడు! వీణ్ణి దేవాదేవేషుచేస్తాను!

జ్ఞాన—ఆహా! ఆభాగ్యమే నాకుఁగల్గినయెడల నెంతయదృష్టవంతుఁడనై యుందునోకదా!—

గీ॥ తామరసగర్భముఖ నిర్గతంబయిన, ప
విత్రవిప్రవంశమున నావిర్భవించి,
నట్టి త్వత్పదాంకితమయినట్టి పాద
రక్ష నాదేహమును పవిత్రంబుసేయు॥ ౨౭

కాశీ—ఓరిమొండిముండాకొడుక! నువ్వెంతకైనా తగినవాఁడవేరా! ఒక్కసారి, నిజంగా నాపాదరక్ష నిన్ను పవిత్రంజేస్తేనేకాని, నీకీవెఱ్ఱివేదాంతమణగదు. చీటికి మాటికి మాకొంపకు దాపరించి నాభార్యతో గుసగుసలాడటంమానవు—

అత్త—ముందు దాని పళ్ళురాలగొట్టి కొంపలో కీడ్చుకొరాక, వాణ్ణి కొడతానంటావేమిరా! వాఁడిమాట తరువాత చూడొచ్చునురా! మనబంగారం మంచిదైతే కంసాలివాడేం జెయ్యగలఁడురా! దాన్ని నెత్తినెక్కించుకొని యింత అలుసిచ్చినవాఁడవు నువ్వేరా! దానియెదట నన్ను తిడితేనేకాదషరా దాని కలుసెక్కువైంది! అది నీకేదో మందుబెట్టింది. దానివలలోపడ్డావు? అందుచేతనే దాన్ని గవ్వేత్తుమాటైనా అనలేకుండా వున్నావు? పెళ్ళాం బెల్లం తల్లి దయ్యం అన్నవాఁడు వెఱ్ఱివాఁడా! దాన్ని నెత్తినెక్కించుకో! అమ్మవారి ఘటాన్ని వూరేగించినట్లూరేగించు! ఈవల్లకాట్లోకొంపా యీ దిక్కుమాలిన సంసారం వదిలిపెట్టి నేను ఏకాశికో లేచిపోతాలే! అప్పుడు పెళ్ళాం మొగుడూ సుఖంగా వుందురుగాని—

కాశీ—ఎందుకమ్మా! అంతంత మాటలనుకుంటావు! నీకంటే అది నాకెక్కువఁటమ్మా!

సక్కు—అత్తగారూ! పండరీపురమున పాండురంగనాథునకు బ్రహ్మోత్సవములు జరుగుచున్నవని పౌరులందఱును గుంపులుగూడి దర్శింప నరుగుచున్నారు! రంగసందర్శనమునకై నా యంత

రంగ ముఖ్విళులూరుచున్నది. అనుజ్ఞ యిత్తురా దర్శించి యతి శీఘ్రముగ మరలివత్తును.

అత్త—ఓసి నీయమ్మ కాటికిబోను! ఎంత తెగబడ్డావే! ఎంత ధైర్యంగా అడుగుచున్నావే! పండువంటి సంసారంలో, మట్టిగొట్టుకొని, యీ బికారిముండకొడుకులతో గలిసి, యాత్రకుబోయి యెగురు లాడకపోతినని యేడుస్తున్నావా?—నీయేడుపు ఏట్లోగలవ! నీయాత్ర నిక్షేత్రంగాను!—ఇంకా చూస్తావేమిరా! ఇది యే రాత్రో యేపగలో, కొంపలోంచి లేచి చక్కా బోతుందిరా! స్తంభానికి కట్టిపడెయ్యండిరా!—దీనిరోగం కటుక్కున కుదురు తుంది!—

1 శిష్యు—గురునాథా! పాపమీమెకు, అభిలాషకు దగినంత యధికారములేదు!—ఇట్టి యీసతి యాత్రకువచ్చుట గగనకుసుమము. ఆవల మనకు, కాలాతీతమగుచున్నది. పోవుదమురండు—

జ్ఞాన—రంగనికరుణ—అట్లేపోవుదముపద!—

(అనుబంధము 5) (శిష్యులతో, జ్ఞాన॥ నిష్క్రి)

సక్కు—హా! గురునాథా! పోవుచుంటిరా! పోవుచుంటిరా!—పాండు రంగనితోపాటు, నీకును నాపైఁ గృపదప్పెనా? ఇఁకనాకీజన్మ మున రంగసందర్శనభాగ్యము గలుగదా! కలుగదా!

కాశీ—శీఘ్రింగా దాటిపోయినాఁడో చెప్పుదెబ్బలు తప్పించుకొన్నా డనుకో! గడుసుముండ కొడుకే!—

అత్త—నీకు వాఁడు గురువఁటే! ఆబికారి ముండకొడుకు నీకు గురువటే! వాఁడు నిన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయినాడని వలవల యేడుస్తు న్నావా?—దారివెంటబొయ్యే దౌర్భాగ్యపు వెధవలకోసం తల్లడిల్లటం మానతావా! మానవా! రంగడు రంగఁడని గంగె

క్రొత్తడం చాలిస్తావా చాలించవా?—బుద్ధొస్తుందా? వస్తుందా!

(కొట్టును.)

సక్కు—రంగా! రంగా! శ్రీరంగరంగా! పాండురంగా!

అత్త—అబ్బాయీ! తాడుదీసుకురారా! దీన్ని స్తంభానికి విరిచికడ దాము!—

కాశీ—ఇక్కడగాదు! సావిట్లో విరిచికడదాము! లోపలికిపద!—

అత్త—ఏమే! పద! లోపలికి పద! కట్టిపడేస్తేగాని, నీ తెగులణగదు.

(అందఱు నిష్క్రమింతురు) (తెర.)



తృతీయాంకము.



# సతీ-సక్కుబాయి

## చతుర్థాంకము.

### 1వ రంగము—పండరీపురము.

ప్రవేశము—శ్రీకృష్ణుఁడు—రాధాదేవి.

రాధా—నాథా! లోకైకనాథా!

భక్తజనుల కనుల బ్రహ్మోత్సవములేమి,
తమశరీరమందు, దాసతతికిఁ
గలుగు దద్దులేమి లలితాంగ! నీదుమ
హాత్మ్య మజభవాదు లరయఁగలరె?॥ ౨౮

శ్రీకృ—భక్తుల కష్టములను నావిగా ననుభవించుటయే, నాకు బ్రహ్మా నందదాయకమగు విషయముగా నెఱుంగుము.

గీ॥ భక్తమణియగు నాసక్కుబాయిపైన,
నామె సద్భక్తిఁగని యత్త యాగ్రహించి,
నేడు దయచేసినట్టి యాతాడనములె,
దద్దులై, నాశరీరమంతటనుఁదోఁచె॥ ౨౯

రాధా—ఆఁ! ఆఁ! ఏమంటిరి? ఇవి సక్కుబాయి నామె యత్తగారు ప్రహరించిన దెబ్బలకు ప్రతిఫలములా? ఔరా! ఎంతగర్వ మా యత్తకు? మీభక్తులపై నెంతశాత్రవ మా పాపాత్మురాలికి! నాథా! ఆదుర్జాతివృద్ధురాలి కెద్దియేని ప్రాయశ్చిత్తముఁగావించు

దనుక నా కాగ్రహ మణంగకున్నయది! శీఘ్రముగ, మనమా యింటికిఁ బోవుదము రండు___

శ్రీకృ—దేవీ! నిక్కము వచించితివి. పాపమా సక్కుబాయి, యిప్పుడు తీరని సంకటమునఁ జిక్కియున్నది. ఆకష్టమును నివారింప నేనట కరుగక తప్పదు.

రాధ—నాథా! ఇప్పుడాభక్తురాలికి క్రొత్తగాఁగల్గిన కష్టమెట్టిది?

శ్రీకృ—ఎట్టిదో యాలకింపుము!

ఆ॥ పండరీపురమున బ్రహ్మోత్సవంబుల
టంచు, నిటకురాఁదలంచినట్టి
భక్తమణిని సక్కుబాయి నాసతి యత్త,
త్రాఁటఁగట్టిపెట్టె స్తంభమునకు॥ 30

ఏదేని, యుపాయాంతరమున, నామెను వదలింపవలయును. అభిమతంబుగలదేని, నీవును, నావెంటరమ్ము.

రాధ—అత్తకుప్రాయశ్చిత్తము సేయుటకు నేనును, ఆభక్తురాలికి బంధవిమోచనము సేయుటకు మీరును—అవశ్యముగా నటకరుగుదము. రండు.

(ఇరువురును—నిష్క్రమింతురు.)

(తెర)



## 2 వ రంగము—సక్కుబాయియిల్లు.

(ప్రవేశము—(స్తంభమునఁ గట్టఁబడిన, సక్కుబాయి,)

సక్కు—(అనుబంధము 6.) శ్రీకృష్ణా! భక్తప్రియా! తుట్టతుదకు నాకీస్థితినిగల్పించి యేమియు నెఱుంగనివానిచందమున, నుపేక్షించితివా? స్వామీ!

సీ॥ శ్రీయుతంబైన త్వదీయాకృతినిఁ గాంచి,
కుతిదీరఁ బ్రణమిల్లఁగోరికోరి
చంద్రభాగానదీసాంద్ర తరంగంబు,
లందు గ్రుంకగ వాంఛనందియుంది
తనివార నీదు తీర్థప్రసాదంబుల,
నారగించెదుగాంక్ష నరసి యరసి
నీమమొప్ప సహస్రనామార్చనము స్వహ
స్తంబులఁ గావింపఁ దలఁచి తలఁచి,
బెంగగొంటి పాండురంగా! జగన్నాథ!
శ్రీరమేశ! కృష్ణ! శ్రీనివాస!
రమ్యమౌ త్వదీయ బ్రహ్మోత్సవముఁగాంచు,
భాగ్యమింక నొసఁగవా? మహాత్మ! 30

స్వామీ! ఎంతప్రార్థించినను, ఎంత మొరవెట్టినను, ఎంతప్రలాపించినను, ఎంతబ్రతిమాలుకొనినను, నాయాలాపనములు పవిత్రము లగు నీశ్రవణంబులం జొరకున్నవా? తండ్రీ—కాకున్న నన్ను రక్షింప వచ్చుటకు పండరీపురము, మా యగ్రహారమునకు దూరమాయెనా? గరుడగమనా! నాడుసభలో నార్తయై వేడుకొనిన పాంచాలిని గాచిన కథ నీకు స్మృతికిరాదా! మకరిచే బాధింపబడి యాక్రందించిన గజేంద్రునిఁ బ్రోచిన చరిత్రము నీకింతలో మఱపునకు వచ్చెనా?—ప్రహ్లా

దునిఁ బాలింప నరహరివై సభాస్తంభంబున నావిర్భవించిన మాటను, నే నెఱుంగననుకొంటివా?—వారందఱును నీకు దగ్గఱచుట్టములైరా? నేను కాకపోతినా? నాపై నీకింత నిర్దాక్షిణ్యమేల? ఇంతపరాకేల? స్వామీ!—రాధాదేవిగాని, రుకుమాబాయిగాని నిన్ను తమ భుజలతలంగట్టి పండరీపురముననే బంధించిరా?—

సీ॥ సోదరియని ద్రౌపదీదేవిఁ బ్రోచితి
వేమొ! నే, నీబిడ్డనే మహాత్మ!
ఆర్తుఁడంచు, గజేంద్రు నప్పుడేలితివేమొ—
యిపుడార్తి నే నందనే! దయాళు!
అలకుచేలునుమైత్రి నరసిభాగ్యములిచ్చి
తేమొ! నాయెడనైర మేమి? స్వామి!—
దాసుఁడనుచు, రామదాసుఁగాచితివేమొ!—
నేను, నీపదదాసినే! కృపాబ్ధి!—
ఎంతకాలమునినుఁ బ్రతీక్షింతునయ్య!
ఎంతగానీకొఱకుఁ విలపింతునయ్య!
తాలిమివహింపఁజాల—నాతండ్రివైన,
దైవమైన నిన్నిక వేడుదానఁగాను॥— 3౨

అహోరాత్రములు, నీకొఱకెంత యాతుర పడుచుంటినో, నీయంతరాత్మ యెఱుంగదా! లోకచక్షూ! అత్తగారిచే స్తంభమునకుఁ గట్టువడి యెంత యలమటించుచుంటినో—కనంబడదా! దయాభరణా? భౌతికంబగు నీమొండిశరీర మిచ్చట ప్రాకులాడుచున్నను నాయాత్మ పండరిపురంబున నిటుకరాలపై నిలచియున్న నీపదపద్మముల సన్నిధిని నిలచి నీకృపారస ప్రసారమునకై యెంతగా విలవిల కొట్టుకొనుచున్నదో గ్రహింపవా? విశ్వంభరా! ఇట్టి నాయందా నీకింతనిరాదరణము! నాపైననా యింతనిర్దాక్షిణ్యము! నాయెడలనా నీకింత విముఖత్వము!— నాకు, నీయాలయంబున, యుష్మత్పవిత్రోచ్ఛిష్ట ప్రసాదంబు నేరుకొని

తిను వాయసంబునకుఁగల యదృష్టమైనలేదా? నేను నీకంతపగదాయినై పోయితినా? ప్రాణములు నీకర్పించితిని! తుచ్ఛమైన యీశరీరమును నీకర్పించితిని! నాసర్వావయవంబులను, నీసేవాకైంకర్యమునందే, విని యోగించితిని! గోపీలోలా! గోపాలబాల! కాంచనచేలా! నాయందింకను నీయుపేక్షాపరత్వము నుపేక్షింపవేల?—పండరిపురినుండి, యిఁకనైనఁ గదలిరావేల? నేను నీకు భారమా! యిదిదూరమా! రమారమణా!—

సీ॥ నోరునొవ్వఁగనిన్ను నుతియించి, నాలుక
ధన్యమయ్యెనటంచుఁ దలఁచినాను,
చేతులారగ నమస్కృతులాచరించి, హ
స్తములు ధన్యములంచు దలఁచినాను,
చరణద్వయము నలసటనంద నృత్యము,
సలిపి ధన్యములంచు దలచినాను,
కంఠముతడియార గానంబుఁజేసి, య
ద్దాని ధన్యంబుగాఁ దలఁచినాను,
దేహమన్యకార్యంబులఁ దిరుగుచున్న
మానసము నీభజనమందె లీనమగుట,
పుట్టుకకు సార్థకంబని పొంగినాను,
గాని, ప్రారబ్ధహేతువుఁ గాంచనైతి॥ 33

ఆ॥ అహరహంబు నిట్టు లాహారపాన ని
ద్రావిహీనతలకు దలకఁగాని
పరమపురుష! నీదు బ్రహ్మోత్సవంబు ద
ర్శించు ప్రాప్తిలేదటంచు వగతు॥ 38

సంతతము, మానవులు స్మరించువిషయములే స్వప్నముగాఁ బరిణమించునని, తత్త్వజ్ఞులు వాకొందురు. కావున, నోదేవా! కొంత కాలము కన్నులు మూతును. స్వప్నమునందైన సాక్షాత్కరింతువేమో!

(కన్నులుమూయును)

(రాధా, కృష్ణులు ప్రవేశము)

కృష్ణు—రాధా! భక్తురాలగు సక్కుబాయి, పాప, మెట్టిస్థితియం దున్న దియో చూచితివిగదా!

సీ॥ వెనుకకు స్తంభాన విరిచికట్టఁగబడి,
లయతోఁ గరములు తాళంబువేయ,
కదులమెదులలేని కాయంబుతోనోట,
రంగాయనుచు సంస్మరణముసేయ,
అరమోడ్చి భావనయందు లీనములైన,
కనులునారూపునే కాంచుచుండ,
తాళ్ళఁటఁజుట్టఁగఁబడ్డ తనువెల్ల, నాణిము
త్యములనుఁబోలు స్వేదమునువిడువ,
గీ॥ భక్తిచేతనో—తనయత్త వలనభయము
చేతనో, గుండెలదటునఁ జిందులాడ,
తరుణి మూర్తిఁదాల్చిన భక్తితత్త్వమట్లు,
చలనమును మానియున్నది సక్కుబాయి॥ 38

ఈమె నీస్థితియందు పరిరక్షించి, పండరీపురమునకుఁబంపి—నా బ్రహ్మోత్సవ దర్శనమువలనం గలుగు నానందముం గల్గింపకున్న నింక నాభక్తసంరక్షణ బిరుదమేల? కాల్పనా?

రాధ—నాధా! ఈమెనిప్పుడు మీరేయుపాయమున రక్షింపఁదలఁచి యున్నారు?—

కృష్ణు—దేవీ! ఉద్దేశ్యము గలుగవలయునేగాని, యుపాయముల కేమి కొఱంత?

ఆ॥ మాయచేత సక్కుబాయి రూపముదాల్చి,
కట్టువడెద నామె యట్టులిచట,

సక్కుబాయిమరలి చనుదెంచుదనుక, నే
నిందు సక్కువోలెనుందు; రాధ!— ౫౬

రాధ—ఓహో! ఇదియేమినాధా! తమ లీలానటనము పరమాద్భుతముగ నున్నదే తమరిందు దాస్యమునఁ జిక్కియుండఁగనే, భక్తులందఱును, బ్రహ్మోత్సవ మిషంబునఁ దమకు దాస్యముచేయుచుందురా?

కృష్ణు—దేవీ!—భావననుమించిన పరమార్థములేదు—అచట నేనుండుట యొకటియు—లేకుండుటయొకటియునా? నేను సర్వాంతర్యామినగుట నీవెఱుంగవా?

ఆ॥ ఇచట నచట ననఁగనేల మేరునగంబు
నందు నణువునందునుందు సమత
ఇందునందు ననఁగనేల సర్వచరాచ
రముల రూపకోటి నమరఁదాల్తు॥ ౫౭

రాధ—సర్వచరాచర రూపసంస్థితులును, సర్వాంతర్యాములును, సాకారనిరాకార సమపరబ్రహ్మలును, జగన్నాటక సూత్రధారులును నగు తమకిట్టి లీలానటమే యానందదాయకమగునుగాని, మముఁబోటి యవరోధజనంబులకు, దేవరవారి యతికాల విశ్లేషము దుస్సహదుఃఖదాయకము గదా!

కృష్ణు—రాధా! భక్తరక్షణమునాకెట్లో—మీయందఱకు నట్లె పరమకర్తవ్యముగదా!—కావున, సక్కుబాయి కొఱకును, నాభక్తావన ప్రతిజ్ఞానిర్వహణము కొఱకును, మద్విశ్లేషదుఃఖమును కొన్నినాళ్ళు మీరు భరింపకతప్పదు—

గీ॥ భక్తురాలికి బ్రహ్మోత్సవంబు గాంచు
మోదమునుఁ గల్గఁగాఁజేసి, మూర్ఖులైన

సక్కునత్తకు భర్తకు, నిక్కమైన
భక్తిఁ గల్గించివత్తు సత్వరము మరలి॥ ౩౮

రాధ—జగన్నాయకా! సమస్తసురాధీశ్వర శిరఃకిరీరస్థగిత మణిఘృణీ నీరాజిత పాదపీఠులై—సకల బ్రహ్మాండమండితోదరులై—మూర్తిత్రయాతీతులై—బ్రహ్మాండనాయకులైన తమకు—నేటికొక నిరుపేదబ్రాహ్మణికారణంబున, నిష్కరుణులగు ధూర్త విప్రుల పూరింట దాస్యమా? ఆహాహా! తమవంటివారికిని విధి వ్రాత నతిక్రమించుట దుస్సాధ్యమయ్యెనుగదా! నాథా!—

సీ॥ ఇంటిచాకిరి నిర్వహింపఁ దప్పులనేరి,
యెంతగా మిమ్ము బాధింపఁ గలదో!
గడగడవణకించు చలికైన సహియించి
చన్నీటిస్నానముల్ సలుపుమనునో!
పీతాంబరంబును విడచి వైదికపు రై
కను చీరనందించి కట్టుమనునో!
అష్టసతీ లౌల్యమణగించి కొడుకుతో,
పడకఁ గాపురమును మిడుకుమనునో!
కొట్టునో యేమొ—చీపురు కట్టతోడ,
నింక నెట్లు బాధించునో యేమిగతియొ—
విశ్వపతివైన జగదేక విభునిచేత
ప్రకట కలహోక్త యాసక్కుబాయి యత్త॥ ౩౯

కృష్ణ—కల్యాణీ! ఇవియన్నియు నిజముగా ముందు ప్రవర్తింపఁగల కృత్యంబులేయగుట నిక్కము. ఇవి, నీమదికిఁ గష్టముగానుండిన నుండుఁగాక! నాహృదయమునకుఁ బరమ ప్రమోదప్రదంబులు. కావున, నాకొరకై విచారింపక నీవు పండరిపురంబునకుఁ గదలి పొమ్ము. నేను త్వరలో రాఁగలను.

రాధా—నాధా! తమహృదయమున కానందకరములగు విషయములే మాకును పరమానందప్రదములు!—నాకు మీవిషయమైయింక విచారమేమియునులేదు. కాని, యీసక్కుబాయియత్తకొకింత బుద్ధిజెప్పి పోవలయుననియున్నది. ఆయవశిష్టముం దీర్చుకొని నేనరిగెదను—

కృష్ణు—ఆమెకు, ప్రాయశ్చిత్తము కాలాంతరమున పాపపరిపాకసమయమున నదియే కలుగఁగలదు. నీవాప్రసక్తిం దగులకుము. పొమ్ము—

రాధ—అట్లయిన తమయభిష్టానుసారమే యొనరింతును. నాకింక సెలవు. తమరు సత్వర దాస్యవిముక్తులై దయచేతురని ప్రార్థింతును.

(నిష్క్రమించును.)

( అత్త—ప్రవేశము. )

అత్త—ఏమే! సక్కూ! ఇప్పటికైనా బుద్ధి తిరిగిందాలేదా?

సక్కు—(కన్నులుదెరచి) ఆహా! ఎంతటిదివ్యస్వప్నము!......అత్తగారూ! ఇప్పుడిచటికి, రాధామాయితోఁగలసి, శ్రీపాండురంగమూర్తి వేంచేయలేదా?—వచ్చినచో నింతలో నెందు బోయెను?

అత్త—ఓసి నిర్భాగ్యపుచచ్చినదానా! ఇంకా నీకీరోగం అణగలేదటే? కలగంటున్నావా! పిచ్చిపట్టిందా? ఎక్కడికృష్ణుడే నీబొందమీఁది కృష్ణుఁడు!—

సక్కు—కాదుకాదు, మీరుభ్రమపడుచున్నారు? సర్వాంతర్యామియగు నాభగవంతుని శుభాగమనమును మీరు గుర్తింపఁజాలకున్నారు! చూడుఁడు.

సీ॥ చెవియొగ్గివినరమ్మ! శ్రవణపర్వంబుగా,
వంశీస్వరము వినంబడునుమీకు,
కనులారఁ గనరమ్మ కంబుచక్రాంకిత
పదచిహ్నములు కనంబడునుమీకు,
మూఁచూడరమ్మ! సమ్మోహనాగరుగంధ
ఘనసౌరభము, గుబులొ్కనునుమీకు
మదిఁగాంచరమ్మ! కోమలఘనశ్యామల
దుగ్లోక తేజంబుదోఁచుమీకు
గీ॥ శ్రీవిభుఁడు రాధికాసతి చెట్టవట్టి,
నన్ను రక్షింప వచ్చియున్నాఁడు నిజము;
వచ్చి యీక్షణమున నెందు జొచ్చెనమ్మ?
చేరి ప్రార్థింతు; దాచక చెప్పరమ్మ॥— ౪౦

అత్త—కానీ! కానీ—లే—ఇహ నిన్ను కొట్టినా తిట్టినా ఏంజేసినా లాభంలేదు. నీకిదే ప్రాయశ్చిత్తం—ఇట్లాస్తంభానికి కట్టుబడివుండు. ఏన్నాళ్ళుంటావో చూస్తానుగాదూ! (నిష్క్రమించును)

కృష్ణు—(స్వగతము) అత్త మరలిరాకమున్నే, నేను సక్కుబాయిభర్త రూపమున వచ్చి యీమె నిర్బంధమును వదలించి స్తంభమునఁ గట్టువడియుందునుగాక— (నిష్క్రమించును)

సక్కు—(స్వగతము) వేణునాదప్రియా! రాధానాథా! నీవువచ్చితివి—పోయితివి. ఎందులకు వచ్చితివో—ఎందులకు పోయితివో—ఎచటికి బోయితివో ఎన్నడు మరలవచ్చెదవో—ఎఱింగినవా రెవ్వరునులేరుగదా! ఈదాగుడుమూతల పరమార్థమేమిస్వామీ! నీవువచ్చితివని పలికినంతనే అత్తగారికంటికి నేను వెఱ్ఱిదానివలె గనంబడితిని. నన్ను వెఱ్ఱిదానవని పలికిన యత్తగారు వెఱ్ఱిదని నేను తలంచుచున్నాను! ఈవిధముగా జగమంతయు నీమహిమచే వెఱ్ఱిదై పోవుచున్నదిగదా!—

సీ॥ తలక్రిందుగా ఘోర తపమాచరించియు
విఫలాత్ములౌ మునుల్ వెఱ్ఱివారు;
తీర్థయాత్రలును, నదీస్నానములుజేసి
విసిగెడు యాత్రికుల్ వెఱ్ఱివారు;
హఠయోగములచేత నలసటఁగను నవి
వేక, సన్యాసులు వెఱ్ఱివారు;
ఎదుటనేయున్న నిన్నెఱుఁగఁగాలేక, ని
ర్విణ్ణులౌ లోకులు వెఱ్ఱివారు;
కోరి, భక్తిమీర—నోరార నిన్ను "రం
గా"యటంచు బిలుచునట్టి యాత్మ
భక్తకోటి కిట్టె ప్రత్యక్షమగుచుందు
వీ విచిత్ర మహిమ నెఱుఁగ రెవరు॥ ౪౧

(కృష్ణుఁడు కాశీపతి వేషముతో ప్రవేశించును)

కపటకాశీపతి—సక్కూ! సక్కూ! మాఅమ్మ నిన్నింకా స్తంభానిక విరిచి కట్టేవుంచిందా?—

సక్కు—నాథా! వచ్చితిరా! అత్తగారితో సమానముగ, మీరును నిర్దయాత్ములరైతిరా?—నన్నీ నిర్బంధమునం దింక నెంతకాల ముంచెదరు?

క-కా—సక్కూ! నీకు నిజంగా పండరీపుర బ్రహ్మోత్సవము చూడా లని కోరికగావుందా? నిజం జెప్పు—

సక్కు—నాథా! నిజముచెప్పినను, అనృతముచెప్పినను, ఫలమొక్కటె యేకదా! అభిలాషయున్నంతమాత్రమున నన్నచటి కంపువారె వ్వరు? ఆకాశకుసుమములతో తుల్యములైన నాయాశలవలనఁ బ్రయోజనమేమి?

క—కా—ప్రయోజనమున్నది! నీకభిలాషగావుందేమో నిజంచెప్పు_

సక్కు—అయ్యో! అభిలాషగలదాయని ప్రశ్నించుచున్నారా? ఆయభిలాషచేతనేకదా యీనిర్బంధమును సయిత మనుభవింపవలసి వచ్చినది.

క—కా—నేను నీవిషయంలో, మాఅమ్మతో యిప్పుడే చాలాసేపు గట్టిగావాదించి, త్వరలోనే నీవు పండరీపురంనుంచి మళ్లీవచ్చే పద్ధతిమీఁద, ఆమెను సమాధానపరిచాను. మనపొరుగింటి పున్నయ్యశాస్త్రి ఆవిడభార్యా వెళుతూవుంటే నిన్నుగూడా తీసుకొనివెళ్ళవలసిందని ఏర్పాటుచేశాను. గుమ్మంలోవాళ్లు కని పెట్టుకొనివున్నారు. నీవు త్వరగావెళ్లిరా! నీబట్టలుగూడామూట గట్టి తెచ్చాను. నీకట్లువదలిస్తాను, ఇకవెళ్ళి దేవుడిదర్శనం చేసికొని శీఘ్రంగా రా—

(కట్లు విప్పును)

సక్కు—(ఆనందముతో) హా! పాండురంగా! ఇంతకాలమునకు నీకు నాపై ననుగ్రహముగలిగెనా? నీచిత్రము బ్రహ్మాదులకుఁ గూడ నవేద్యమైనదిగదాస్వామీ!—

క—కా—ఇక యిక్కడుండకు. శీఘ్రంగావెళ్ళు—మళ్ళీమాఅమ్మకేమి తిక్కపుడుతుందో!—

సక్కు—నాథా! మీపాదపద్మముల కనేకనమస్కారములు! నాకుదయతో సెలవిండు. శీఘ్రముగ మరలివచ్చెదను.

(నిష్క్రమించును)

కృష్ణు—(స్వగ) ఇప్పటికిఁగదా భక్తురాలికి నిర్బంధమువదలెను! నాహ్రు

దయభారము వదలెను. ఇంకనేను సక్కుబాయినాకృతితో నీ స్తంభమునకుఁ గట్టువడియుండెదఁగాక!

(స్తంభమున కానుకొనగా తాళ్లు తనంతనే బంధించును)

ఆ॥ సక్కునాటకమున, జరిగెనాల్గంకము
లింక నొక్కయంకమిందు గడచు,
పంచమాంకమందు భరత వాక్యమునకు
ముందు—మోక్షమిత్తు నందఱకును॥ ౪.౨

(అనుబంధము 7)

చతుర్థాంకము.



# సతీ-సక్కుబాయి



## పంచమాంకము



### 1 వ రంగము—పండరిపురము.

ప్రవేశము—పెద్దిసెట్టి.

పెద్ది—గోల! గోల! ఒక్కటేగోలగందా—యాత్తర యాత్తరంటే, అదేందో పెద్దసంతగందా అనుకోని సంబరపడి, యవ్వారమంతా యెక్కడిదక్కడ దిగదొక్కుకోని, వొచ్చానుగాని, యీమాయగోలసంగతి తెలిసుంటే గల్లాపెట్టెకాణ్ణుంచి కదిలే వోణ్ణా?—దాన్నోట్లోమన్ను బడ! మాయసచ్చింది మాయెదవల త్తప్పముండ యెదురుగ్గావొచ్చింది. అప్పుడే శెకునమైందనుకున్నా—కుక్క సంతకుబోయినట్టు దుడదుడా యాత్తరకొచ్చానన్నమాటేకాని, అనుకున్న యెవ్వారాల్లో అరబాగమన్నా జరగలేదుగదా! ఒకబేరమా— ఒకసారమా— ఏముందీడ? నాయెదం!—యాడికిబోయినా పీడాకారపోళ్ళు దానం దానం అనుకుంటా సేయిజాచేవోళ్ళేగాని, పదిడబ్బులులాబించేదారిజూపే యెదవొక్కడైనా కనపడదుగందా!—

సీ॥ చంద్రబాగ నదిలో సలితో వొణుకుతూంటె,
పీక్కొతినేవోళ్ళు బేపనోళ్ళు,
గుళ్ళోకిబోతూంటె గుంపులు గుంపులై
వెంటబడేవోళ్లు బిచ్చగాళ్ళు,

సిప్పనెత్తినఁబెట్టి సేయిజాపేవోళ్లు,
సామిదక్షిణకు పూజారిగాళ్లు,
పూలమ్మతామని బోడిసాతానోళ్ళు
డబ్బులాగారాళ్ళ దెబ్బగాల,

గూనివాళ్ళును మఱికుంటిగ్రుడ్డివాళ్ళు,
తలపడేవాళ్ళు; పెద్దభూతాలలాగు,
అమ్మకపుకొట్టె యీతీర్థయాత్రకంటె,
గుమ్మగావుంది నామట్టు కమ్మతోడు॥ ౮౩

బుద్ధిలేనోడూ—పనిలేనోడూ—బతకలేనోడూ, తీర్తానికి రావలిసిందేగాని, సంసారికిమాత్రం—యిదిలచ్చనంగాదని కన్నెకామొమ్మరు మీద వొట్టేసుకుని మరీచెపుతా—లేకపోతే, యీతానాలేంటి—యీప్యానాశారాలేంటి— యీప్రెదచ్చినాలేంటి— యీమొక్కుబళ్ళేంటి—మొత్తుకోళ్ళేంటి—అన్నిటికీ డబ్బు కరుసేగెందా! చసంతీరికె లేదు— దమ్మిడీ ఆదాయంలేదు— ఏమియాత్తర— నాబొందమీది యాత్తర—కూటికొచ్చినయాత్తరా— గుడ్డకొచ్చినయాత్తరా— ఈ తాళాలూ తప్పెట్లూ— బజన్లూ పాడూ— చూస్తావుంటే— అమ్మతోడూ—నావొళ్ళు మా సిరసిర లాడుతూంది. ఇంతటితోటి జాతర సౌఖ్యంచాలుగాని, ఊరోళ్లెవళ్లైనా తోడుదొరికితే తిన్నగా కాలికి బుద్ధిజెపుదును— అన్నట్లు— శెంబుచాత్తుర్లీ గందరగోళంలో పురుగు నాకపొయినాడే!—మొన్నతానంజేత్తావుంటే కామోసు— నదికాడ నీరుకాసులుబడతా కనపడ్డాడు. అప్పట్నుంచి జాడా జబాబూలేదు. (మొగమునకు చేయిఅడ్డముబెట్టుకొని చూచుచు) ఆవొచ్చేమనిషి చాత్తుర్లలాగే వున్నాడే!

(శంభుశాస్త్రి ప్రవేశము)

శంభు—అదుగో! పెద్దిసెట్టిలాగున్నాఁడే! సెట్టీ! ఇంకాబాగున్నావా!—

పెద్ది—అదుగో! శాత్తుర్లూ! వోగాయిత్తంగా వొంకరమాట్లాడతావే మయ్యా!—

శంభు—నిజంగా సెట్టీ! నీతోడూ—నెలలునిండిన పేరంటాలుకుమల్లే—గూసలాంటికడుపుతో, గున్న యేనుగులాగ, నువ్వీసందట్లో యెక్కడో నలిగిపోయినావనుకున్నానుసుమా! మళ్ళీ నువ్వు నాకంటబడేసరికీ, మాచచ్చినపెద్దల్ని చూచినంత సంతోష మొచ్చింది' నువ్వు నిజమనుకో—అబద్ధమనుకో!—

పెద్ది—ఛీ! ఛీ!—అన్నీ వోగాయిత్తం మాటలే—అన్నీ ఔశెకునం మాటలే! పగిలుబుట్టావా—రాతిరిబుట్టావా శాత్తుర్లూ—

శంభు—ఖరసంవత్సరపు కరువుకు, నువ్వూ నేనూ, వొక్కగడియలోనే పుట్టాంగాని—రెండురోజుల్నుంచీ ఎక్కడా కనబడలేదు. ఏమై పోయినావూ?

పెద్ది—ఇంకాపైగా నామీదేనా నిష్టూర్యం? ఈనరడివిలో రెండు రోజుల్నుంచీ, సెల్లనిడబ్బులాగ తిరిగీతిరిగీ, కాళ్ళరిగిపోయినయి గాని, నువ్వుకాపడందేనా!—ఐతే, సరేగాని, జాతరసొక్కెం బాగానేవుంది పెండలాడే కొంపకు జేరదాం—నీ పెయాన మెప్పుడేంటి?

శంభు—ఏమిటీ! అంతతొందరగా ప్రయాణం గడుతున్నావు? యాత్ర నీకేమీ నచ్చిందిగాదా యేమిటి?

పెద్ది—మాబావమరిది బొందలాగుంది. యాత్తరంటే యిదేనంటయ్యా నేనేంటో అనుకోనొచ్చాను.

శంభు—మరి—యాత్రంటే నువ్వేమనుకున్నావేమిటి?

పెద్ది—ఏమనుకున్నానో—సెప్పేదా? షలాకోలాలుపట్టించి, సింకిసేటలు కట్టవుగందా—

శంభు—వేళాకోళాలా?—రామరామ—కొత్తగా నీకూ నాకూ ఎప్పుడైనా వుందా?

పెద్ది—ఐతే—సెపుతున్నానిను—

సీ॥ కొబ్బరికాయొకటి గుళ్ళోనికేగాని,
బారెగ కురిడీల బేరమేది?

శంభు—ఓస్! ఇంతేనంటోయ్ సెట్టీ—ముసుగులుకప్పుకొని ఎన్నికురిడీలయాత్రికొచ్చినవో కనబడలేదూ! పోనీ—పదికురిడీలు బేరమాడలేకపొయినావా! అట్టే—వ్యాపారానికి పనికొచ్చును.

పెద్ది—ఆ, కురిడీలు నీకేబాబూ! సచ్చులిపాయలమ్మకునేవోణ్ణి—సరసమెరగనోణ్ణే—నాకెందుకు—ఇంకా సెపుతానిను—

సీ॥ —పిడికెడు బియ్యము బిచ్చాలకేకాని,
బస్తాలకొద్దీ యవారమేది?

శంభు—ఏమిా!—ఇంత యాత్రిలో బస్తాలే తక్కువైపోయినావా నీలాంటి బలిసిన బస్తాలు చాలావచ్చినవే! అందులో నువ్వు బియ్యాపు బస్తావో—పిప్పళ్ళబస్తావో—ఉప్పుబస్తావో పప్పుబస్తావో ఏదోవొకటవుతావుగదా! ఇంకాయిలాంటిబస్తాలు కొన్ని కలుపుకుంటే కావలసినంత యవ్వారం—

పెద్ది—చాల్చాలులేవయ్యా! నేర్చుకొని పొయినావు శాస్తుర్లూ! అందటూ నీలాగే, గొల్లబామ పురుగుల్లాగ పిల్లగాలికే పిల్లిమిరియాలేస్తారంటయ్యా! తిన్నా నాలాగ మానెడు బియ్యపన్నం తినాలె—కన్నా నాలాగ పదిమంది బిడ్డల్ని కనాలె!—దానికేంగాని, యింకా సెపుతున్నానిను—

సీ॥ ధర్మాలకని రాగి దమ్మిడీలేగాని,
వొడ్డీయవారపు మోచనేది?

శంభు—ఈయాత్తర్లోగూడా నీకు వొడ్డీ అసలూ కలవరింతలుదప్ప మఱోకవ్వూహే లేదేమిపాపమోయ్ సెట్టీ! యాత్రకోసం కొద్దో గొప్పో ఖర్చుపెట్టావుగదా! అది అసలనుకో! వారంరోజుల పాటు వ్యాపారం కట్టిపెట్టావుగదా! అది వడ్డీ అనుకో!— ఇంకేమిో?

పెద్ది—మంచిలాబసాటి యవ్వారం చూపించావయ్యా శాత్తుర్లూ! ఇంకో వారంరోజులపా టీలాగంటె జాతర్లెంట దిరిగితే సిప్పట్టు కొని బైలెల్లాలిసిందే! ఆసంగతికేంగాని యింకా యినుమఱి

సీ॥ గంగిరెద్దులవోళ్ళ గంద్రగోళమెకాని,
పేరైన గిత్తల బేరమేది?—

శంభు—పెద్దిసెట్టీ! పాండురంగడియాత్ర పశువులసంత కాకపోయెనని విచారపడుతున్నావా?—భక్తిలేని మనుషులంతా రెండుకాళ్ళ పశువులతో సమానమని పెద్దలనగా వినలేదూ?—ఈవచ్చిన జనంలో ఆలాంటి పశువులు అనేకవేలుండవచ్చును! ఇదికూడా ఒకవిధంగా పశువులసంతే కనుక నీకావిచార మక్కఱలేదులే!—

పెద్ది—అబ్బో! అబ్బో! ఎట్టిచాత్తుర్లుగాఁడు. ఏళాకోళాలచాత్తుర్లే!— ఇసిరాఁడు మాబాగాయిసిరాఁడు! ఈదెబ్బ నామీఁదేకా మోసు!—కొడితేకొట్టావుగాని, కొసకంటాయిను—మఱి—

ఆ॥ యాత్తరేత్తరంటె యేంటోగదా అని,
మొదలుదెలియకుండ మోసపోతి
తిన్నగుండలేక తీర్తానికొత్తేను
సొమ్ముబోయి తుదకు రిమ్మబట్టె. ౨౨

శంభు—సొమ్ముబోయిందని యేడుస్తున్నావేమోగాని రిమ్మబట్టడానికి నీకేమొచ్చింది—దుక్కలాగున్నావు!—

పెద్ది—సత్రంబోజనాలుమరిగి నువ్వా నాకంటే దుక్కలాగే బలిశావు గాని శాత్తుర్లూ—ఇంతకూ నీప్రెయాణమెప్పుడో చెప్పావుగావు.

శంభు—బ్రహ్మోత్సవంగాందే ప్రయాణమేమిటోయ్! ఎందుకొచ్చినట్టు ఎందుకుపోయినట్టు?—

పెద్ది—బెమ్మోచ్చమో!— పీడాకారమో— అయ్యన్నీ నాకెందు కయ్యా! కోమటోణ్ణి—

శంభు—ఈసాయంత్రమే బ్రహ్మోత్సవం జరుగుతుంది! ఈవొక్క పూటా వోపికబట్టు—తెల్లారగట్ల—లేచిపోదాము.

పెద్ది—మాపెద్దోడు—అసలే పెంకెగటం—ఏదో యాపారం మొలగ బెట్టుకొత్తానంటే సరేకామోల్సని సంబరపడ్డాడు—యెలగబెట్టిన యవ్వారాలు లేకున్నా— యెంటనే కొంపకై నాపోకపోతే, నా గొంతుక్కాయ కోరికేత్తాడు—ఏమనుకున్నావో—

శంభు—భయంలేదులే! మీపెద్దోడితో నేను చెపుతాను! ఇట్లాంటి బ్రహ్మోత్సవం నీజన్మంలో మళ్ళీ చూడగలవా?—

పెద్ది—ఏంజేత్తావో—అంతానీదేబారం—ఇదుగో! శాత్తుర్లూ! డబ్బుకు గూడా నిక్కచ్చిగా వుండేట్టుంది. నీలాటిరేవులో నీరుకాసులు దండుకున్నట్టున్నావు! కొద్ది గొప్ప సర్దాలెమరి! నీపాతబాకీ గీరి నట్టూవుంటుంది! నా యాత్రకర్చు గడిపినట్టూవుంటుంది.

శంభు—అట్లాగేచూతాంలే! ఈవేళకుండు—

(తెరలో) జయా! సక్కుబాయికి జయా!—

పెద్ది—అదేంటయ్యో! ఆ గోలిన్నావా శాత్తుర్లూ! సక్కూబాయంట! మనూరి సక్కూబాయమ్మగాదుగందా!

శంభు—అవునవును. మనయూరి సక్కుబాయిలాగేవుంది! ఆమెవెంట

భజనలు చేస్తూ—జయశబ్దాలతో గుళ్ళోకి తీసుకొనిపోతున్నారు. ఆచిత్రమేమిటో మనంగూడా చూచేపోదాం—నాలుగడుగులు తొందరగా పడనియ్యి.

పెద్ది—పొణకలాంటి ముండాకొడుకును, బోర్లబడగలను· నీపుణ్యమా యిరి, నిమ్మళంగా నడువు శాత్తుర్లూ!—

(ఇరువురు నిష్క్రమింతురు.)



2 వ రంగము—పాండురంగని ఆలయము.

ప్రవేశము—దేవుని కెదురుగా భక్తులనడుమ సక్కుబాయి.

భక్తులు—(అనుబంధము 8)

సక్కు—(పాండురంగనికి సాష్టాంగనమస్కారముచేసి) హా! రంగా! పాండురంగా! ఎన్నినాళ్లకు నీ దివ్యసందర్శనభాగ్యముం గలుగఁ జేసితివయ్యా! ఎన్నినాళ్ల కీయభాగినిపైన, నీకృపామృతమును వర్షింపఁజేసితివయ్యా!—ఈశుష్కప్రాణిని, నీలోఁ గలుపు కొనవా! దేవా!

సీ॥ ఇన్నినాళ్లకుఁగదా—నిన్ను నిర్భయముగా
స్మరియించి భజనంబు సలుపఁగలిగె—;
నేడుగదా పాపనిచయ హారం,బగు
శ్రీనికేతనము దర్శింపఁ గలిగె;
ఈనాడుగా కోటిభాను ప్రభాతీత,
మైన యుష్మన్మూర్తిఁ గాననయ్యె;
ఇపుడుగదా—జగద్ధిత మంగళాకర
పదపద్మ సంసేవఁ బడయగలిగె;

నేటికిఁగదా! జగన్నాథ! నిర్మలంబు
నిరుపమాన మహానందకరము, పరమ
పావనంబైన నిశ్చలభక్తి జలధి
మున్గితేలియాడెదు సుపరిమోదమబ్బె॥ ౮౫

కృష్ణా! దివ్యమంగళస్వరూపా! జగన్మోహనమై జగన్మంగళ ప్రదమైన నీమోహనాకారంబును సందర్శించిన యీకన్నులతో—పాపాకరంబగు నీపాంచభౌతిక ప్రపంచకమును చూడఁజాల!—పరమ పవిత్రమైన నీ నామసంకీర్తనం బొనరించిన యీనాల్కతో, నిస్సారమై హేయమగు నితరప్రసంగమునుఁ గావింపనోప!—పరమపదంబగు నీసన్నిధానంబునకు నడచివచ్చిన యీపాదయుగళముతో దుర్జనసమాకులంబగు మా యగ్రహారంబునకు నడువఁజాల!—సమస్త జగత్కర్తవగు నీకు దాస్యంబొనరించిన యీశరీరముతో—నికృష్టంబగు సంసారమునదాస్యం బొనరింపఁజాల!—నీయాలయంబునిఁక విడువఁజాల! నీసన్నిధానముం బాయఁజాల! నీమూర్తినుండి దృష్టిని మరల్పఁజాల!—నీపూజాపరిచర్య నుండి యీహస్తముల నెడసేయఁజాల!—దురాలోకమై—దుర్నిరీక్ష్యంబైన నీ మహాతేజశ్శిఖలయందీప్రాణిని లీనముగావించుకొనుము. అనంత కోటిబ్రహ్మాండముల నిముడ్చుకొనశక్తిగల్గిన, యుష్మన్మహోదరాంతర మున నీయల్పప్రాణికి స్థానము లభింపదా!—ఆహాహా! బాలగోపాలా! గోపికాలోలా! ఆనాటి నీ రాసక్రీడామహోత్సవము నీనాడు మరల నాపాపంపుఁగన్నులకుఁ జూపించుచున్నావా! తండ్రీ! భక్తశిఖామణులారా!—నేత్రపర్వముగా, మనలఁ గన్నతండ్రి—నటించు రాస లీలోత్సవమును దర్శించుచున్నారా? శ్రవణపర్వముగా, మనోహర మురళీగానము నాకర్ణించుచున్నారా?— కన్ను లున్నందులకు వానిని సార్థకములుగా నొనరించుకొనుట కింతకన్న తరుణమేదీ? చెవులున్నందులకు వానిని చరితార్థములు గావించుకొనుట కిదిగదా యదను!

సీ॥ ఒకగోపికకును, వేఱొక గోపికకు మధ్య
శ్రీమనోహరుఁడు వేంచేసియుండ,
ఒకకృష్ణు చిరుతగోపికయు గోపిక చిరు
తను, మాధవుం డందుకొనుచునుండ,
ఘల్లుఘల్లు మనంగ, గజ్జలందెలమ్రోఁత,
నృత్యధ్వనికి, లయనేర్పుచుండ,
ఇందఱికంఠంబు లేకమై పాడెడు,
గానతరంగముల్ గగనమంట
అందఱకు మధ్య త్రిభువనానందమూర్తి,
పంచమస్థాయి మురళివాయించుచుండ,
గోపికాకృష్ణ వలయస్వరూపమైన,
రాసలీలా నటప్రదర్శనముఁ గనుఁడు. ౪౬

ఓభక్తులారా! రండు—రండు—ఊరక తెల్లపోయి చూచెద రేల? మహత్తరంబగు నిట్టితరుణమును వ్యర్థపరచుకొందురా? ఇంతకన్న వెఱ్ఱితనమొందైన నుండునా? ప్రత్యక్షముగ శ్రీపాండురంగమూర్తి తన రాసక్రీడోత్సవ ప్రదర్శనముచే మనపాపపుజన్మల తరింపఁజేయుచుండగా, వ్యర్థులై నిలువబడిమెద రేల? అయ్యయ్యో! నాపలుకులు మీచెవులకు వినఁబడుటలేదా? జగన్మోహనంబగు రాసలీల మీకన్నులకు గనబడుట లేదా?—అయ్యలారా! రండు—అమ్మలారా! రండు—ఇది మన పురాకృత పుణ్యవశంబున లభించిన యపూర్వతరుణము! వ్యర్థము సేయరానిది!—మనమును గోపికాకృష్ణులతోఁ గలసి తాండవింతము—ఆడుదము—పాడుదము—అనుభవింతము—ఆనందింతము. రండు! రండు!

గీ॥ కృష్ణుఁడెన్నడో యానాడు, బృందలోన—
రాసలీలోత్సవంబును జేసెననుచు,
కథలుజెప్ప నాలించుటేకాక, నేడు
కాంచుచున్నాము హితులార! కన్నులార!— ౪౭

అయ్యయ్యో! ఇంకనురాకున్నారేమి! కదలకున్నారేమి? రారా! కృపాసముద్రుఁడగు భగవంతుఁడు మనకనుగ్రహించిన దివ్యమైన తరుణమును వ్యర్థపరచుకొనకుఁడురా! పోనిండు! నేనొక్కఁడనే, గానముచేయుదును. ఒక్కఁడనే నాట్యము చేయుదును!—

## రాసక్రీడాష్టకము.

అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే చాంగనా
ఇత్థమా కల్పితే మండలే మధ్యగః
సంగగో వేణునా దేవకీ నందనః॥— 1

కేకికేకా దృతానేక పంకేరుహో । లీనహంసావళీ హృద్యతా హృద్యతా
కంసవంశాటవీ దాహదావానలః । సంగగో వేణునా దేవకీ నందనః॥ 2

క్వాపివీణాభిరా రావిణాకంపితః । క్వాపివీణాభిరాకింకిణీ నర్తితః
క్వాపి వీణాభిరామాంతరంగాపితః । సంగగో వేణునా దేవకీ నందనః॥ 3

చారుచంద్రావళీ లోచనైశ్చుంబితో।గోపగోబృంద గోపాలికావల్లభః
వల్లవీ బృందబృందారకః కాముకః।సంగగో వేణునా దేవకీ నందనః॥ 4

మౌళిమాలామిళన్మత్త భృంగీలతా । భీతభీతప్రియా విభ్రమాలింగితః
స్రస్తగోపీకుచాభోగసమ్మేళితః । సంగగో వేణునా దేవకీ నందనః॥ 5

చారుచామీకరా భాసభామావిభు।ర్వైజయంతీలతావాసితోరఃస్థలః
నందబృందావనే వాసితామధ్యగః । సంగగో వేణునా దేవకీ నందనః॥ 6

బాలికా తాళికా తాళలీలాలయా । సంగసందర్శిత భ్రూలతావిభ్రమః
గోపికాగీత దత్తావధానస్స్వయం । సంగగో వేణునా దేవకీ నందనః॥ 7

పారిజాతం సముద్ధృత్యరాధావరో।రోపయామాస భామాగృహస్యాంగణే
శీతశీతేవటేయూ మునీయేతటే । సంగగో వేణునా దేవకీనందనః॥ -8(రవ)

(మూర్ఛిల్లును.)

శంభు—ఏమండీ! జ్ఞానయోగీంద్రులవారూ! ఈగంద్రగోళంమీకేమన్నా అర్థమయిందా?

పెద్ది—సక్కుబాయమ్మకు, చానాళ్ళనుంచీ పిచ్చిపిచ్చిని అత్తముండ, మొత్తుకునేది గాదంటయ్యా!—అదే యీపిచ్చి—అర్ధంగావటానికేంటి? ఇదేమన్నా చాత్తరమా? పురాంధమా?—

శంభు—కాదుండవోయ్! కోమటయ్యా! నీకేందెలుసును? వారిని చెప్పనియ్యి-

జ్ఞాన—అయ్యా! అర్థమగుటకేమున్నది? మహాభక్తురాలగు సక్కుబాయి దివ్యదృష్టియందు, శ్రీపాండురంగమూర్తి తన రాసక్రీడా మహోత్సవముం బ్రదర్శించుచున్నాఁడు. పాపాత్ములమును, ప్రాకృతులమునునైన, మనకట్టి దివ్యసందర్శనభాగ్యమగుటలేదు-భక్తుల కసాధ్యమగు కార్యమేది?

సీ॥ బాలుఁడై తననోట బ్రహ్మాండములుజూపె,
తల్లి భీతిల్ల నీ నల్లనయ్య—
మఱిదికి రణరంగమధ్యభాగమున, వి
శ్వావతార ప్రదర్శనముఁజేసె—
చెలియలి కక్షయ చేలంబు లందించె,
నెల్లవైరులకుఁ గన్నెఱ్ఱగాఁగ-
కాళీయఫణిఫణాగ్రములఁ దాండవమాడె,
పాలచెక్కుల ప్రూప బాల్యమందె,
భారమగుకొండ నెత్తె గోపకులు బెదర-
గాలితోఁ బోరె మింట నక్కజముగాఁగ,
పద్మనాభుని లీలాప్రబంధ గీతి
కర్థమునుఁ జెప్ప నేర్చు మహాత్ముఁ డెవఁడు?॥ ౪౯

సక్కుబాయి మహామహిమాత్మురాలు! ఆమెభక్తి యెట్టిదో యాపరాత్పరునకే తెలియవలయును. ఆపరంధాముని మహిమయెట్టిదో

యాభక్తురాలికే తెలియవలయును. మూఢాత్ములమగు మన మా రహస్యార్థముల నూహించుటకైనఁ దగుదుమా?—

శంభు—పెద్దపులిలాంటి అత్తగారి నిర్బంధంలోంచి, ఎట్లాబయటబడి పండరీపురమొచ్చిందోగాని, మళ్ళీ యిక్కణ్ణుంచి యింటికి మాత్రం వెళ్ళేటట్టు కనఁబడదు.

పెద్ది—నువ్వింకా యినలేదంటయ్యా! కాశీపతిశాస్త్ర్లే—సక్కుబాయ మ్మని యాత్రకెళ్ళమని పంపేడంట! పున్నయ్యశాస్త్ర్లంగారి తోటిన్నీ ఆయనభార్యాతోటిన్నీ జతజేసి పంపాడంట!

జ్ఞాన—భక్తపంపుటగాదు. పరమేశ్వరుఁడే యీామె నిటకుఁ జేర్చెను—

శంభు—ఉండండి—ఉండండి—సక్కుబాయి మళ్ళీ లేస్తూంది.

సక్కు—(లేచి) వినదా? సెలవైనదా!—ఇన్నినాళ్ళకా నీసాన్నిధ్య భాగ్యము ననుగ్రహించితివి! వచ్చుచున్నాను. స్వామీ! వచ్చుచున్నాను. శాశ్వతంబగు నీసాన్నిధ్యభాగ్యముంగాంచ వచ్చుచున్నాను. ఆహాహా! మందహాసభాసురంబగు నీసుందరముఖవిలాసము సహస్రమన్మథ సౌందర్యాతీతమై యెట్లు వెలిగిపోవుచున్నదో! శ్యామలాంగా! సహస్రభాస్కర బింబద్యుతిప్రతిమానమై—దుర్నిరీక్ష్యమై—దురాలోక తేజోవిరాజితమై— నీ దేహకాంతి మరీచీజాలములు నాకన్నులందెట్లు మిఱుమిట్లు గొలుపుచున్నవో! మోహనాంగా! రమ్మని కరమ్ములు నావంకకు సాచి పిలుచుచున్నావా? అనుగ్రహించితివా! ఇన్నినాళ్లకు నన్ను నుగ్రహించితివా? ఇంతటి మహానందమును నాకెన్నఁడుంగల్గింపవైతివేమి? చిదానందస్వరూపా! చతుర్దశభువనసమ్మోహనముగా, నిన్నినాళ్లకు నీ మురళీ నినాదముచే, నాశ్రవణ రంధ్రంబులను పావనము చేయుచుంటివా! మురళీకృష్ణా! ఓహో! ఏమయ్యా తండ్రీ! నీతాండవకేళీవిలాసము! శరీరమాపాదమస్తకమును జలద

రించి, రోమాంచితంబగుచున్న దే—చంద్రభాగా నిర్ఝరీవేగ సదృశంబై నాకన్నుల నానందరసము ప్రవహించిపోవుచున్న దే! ఓహోహో! అదియేమి? అదియేమి? లోకాతీతమై ప్రభయార్క బింబముంబోలె నీయాకృతి విశ్వావతారముందాల్చి ప్రకృతి యంతటనునిండి నిబిడీకృతంబగుచున్న దే! ఈమహాతేజము నన్నాక్రమించి నీపావనమూర్తియందు విలీనము గావించుకొనునా? అల్లదే! ఏకాదశరుద్రులీతేజమునందు మునిగిపోవుచున్నారు!—అనంతకోటివిధాత లీతేజమునం దణగిపోవుచున్నారు! ద్వాదశార్కు లీతేజమున, దారులు వెదుకుకొనుచున్నారు!—సురాసుర యక్ష గరుడ గంధర్వాది వియచ్చర సంతానమంతయు నీదివ్యతేజశ్శిఖలందు, తేలియాడుచున్నారు!—అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు, కరంబులుమోడ్చి భక్తియుక్తులై ప్రార్థనలు చేయుచున్నారు! గంధర్వులు కాహళాది వాద్యములను మ్రోయించుచున్నారు! విద్యాధరులు కల్పక పారిజాతాదిసుమ సస్సందోహమును, వేనవేలుగా గుమ్మరించుచున్నారు! అన్నిటినిమించి యతీతమై యాలోకనానందప్రదమై నీగంభీరకాంతి ప్రభయింకను పైపై నాక్రమించి నన్ను ముంచివేయుచున్నది? ఓహో! ఎంతకాంతి! ఎంతటిమహాతేజస్సంపద! రక్షింపుము! స్వామీ! రక్షింపుము! ఈతేజముంగాంచి భరింపఁజాలకున్నాను!

సీ॥ అలముచున్నది; దిక్కులన్నింటనిండి, మ
హోద్దండ మాయాప్రయుక్తకాంతి
ధ్వనియించుచున్నది; దశకోటి కాహళ
దుందుభి వ్రజవియద్ఘోషణంబు
జ్వలియించుచున్నది; బ్రహ్మాండ దాహక
మోహాగ్నిరంగని మూర్తియందు
కాన్పించుచున్నది; గంభీరమై లోక
భీకరాశాంతమౌ విశ్వమూర్తి

ప్రకటమగుచునున్నది కర్ణపర్వమైన,
ధీరమధుర మధురమురళీరవంబు
పిలుచుచున్నాఁడు నన్నదే విశ్వమూర్తి
రమ్యకైవల్య సేవకు రమ్మటంచు. ౫౦

రంగా! రంగా! రంగా!

(నేలపైబడి ప్రాణములు విడుచుచున్నది.)

(గొప్పకాంతితో సక్కుబాయిశరీరమునుండి ప్రాణిలేచి రంగనిలో నైక్యమగును.)

(అందఱును సంభ్రమముతో సమీపింతురు.)

జ్ఞాన—ఓహో! ఇదియేమి పరమాద్భుతము!

ఆ॥ పిక్కటిల్లి-వేయి విద్యున్మరీచుల,
కాంతియొక్క-చోటఁ గలసినట్లు
భక్తురాలు సక్కుబాయి దేహమునుండి,
దివ్యకాంతి దేవదేవుఁజేరె.— ౫౧

పెద్ది—అయ్యబాబో! ఇదేంటయ్యో శాత్తుర్లంగారూ! నేను బతికుండానా సచ్చానా? వో లత్తప్పముంఢోయ్! నీ, చకునంనోట్లో మన్నుబడ! నీనోట్లోదుమ్ముబడ! నా పేణంమీఁదికొచ్చిందే మేయ్! పాడుముండ!—

శంభు—సెట్టీ! ఏమిటా చిరాకు! మేమంతా బ్రదికుండగా నీప్రాణమ్మీఁది కేమొచ్చింది? అట్లా గట్టిగా కళ్లుమూసుకున్నావేం? కళ్ళుదెరువు—

పెద్ది—కళ్ళుదెరవొచ్చునా?-ఇందాకొచ్చిన యెలుగంతా పోయిందా?-

శంభు—వెలుగూలేదు కంచాలేదు. మొద్దులాగ మాట్లాడుతూ బ్రదికున్నానా అని అడుగుతావేమి?—కళ్ళుదెరువు. భయంలేదులే!

పెద్ది—ఏమోబాబూ! కొంపకుజేరదామయ్యా అంటే బెమ్మొచ్చవ మనీ పాడనీ, నన్నూ పోనిచ్చావుగావు, నువ్వూ కదిలావుగావు, పేణాలతో కొంపజేరి, పెళ్ళాం బిడ్డల్ని జూచే వోగముందో లేదో!—

శంభు—నీకు మతేంభయంలేదులే! నూరేళ్ళూ కాకిలాగ బ్రతుకుతావు-

జ్ఞాన—భక్తులారా! మనసక్కుబాయి, పవిత్రాత్మ పాండురంగనియం దైక్యమైపోయినది! ఆహాహా! భగవంతుని సందర్శనమునకై యహోరాత్రములు కలువరించి, భగవన్మాయచే పండరిపుర ముంజేరి, తుదకు భగవత్సన్నిధానమునందే ప్రాణోత్క్రమణ భాగ్యముంగాంచిన భక్తశిరోరత్నమగు సక్కుబాయికన్న ధన్యాత్ములు గలరా?—

ఉ॥ ఏమితపంబు జేసెనొకొ! యీగతి రంగని దివ్యసన్నిధిన్
స్వామి, నిజాత్మయందుఁ, దనప్రాణము లీనముసేయుభాగ్యమీ
కామినిగాంచ గల్గుటకు—కర్మఫలాంతము నందుగాక—యీ
భూమినిఁ బ్రాణికోటి కనుభూతముగావు పురాకృతార్థముల్॥ ౫౨

ఎక్కడి యగ్రహారము! ఎక్కడి పండరీపురము! భక్తిశూన్య యగు నత్తగారేమి? పండరినాథుని బ్రహ్మోత్సవమున కీమెనంపుటేమి? వచ్చి యీమె పాండురంగ చరణారవింద సన్నిధానములం బ్రాణము లను, విడచుటయేమి?—భగవచ్చిత్ర మింతకన్నఁగలదా?

పెద్ది—ఏంటీ? ఏంటీ?— సక్కుబాయమ్మ సచ్చిపోయిందా? నిజం గానే? నిజంగానే?—

శంభు—జ్ఞానయోగీంద్రా! నిజముగానీమె మరణించినదా?

జ్ఞాన—అయ్యా! ఆశ్చర్యమేమి?—చూడుఁడు.

గీ॥ అగ్రహారమునందున్న యప్పుడీమె,
యాత్మ శ్రీరంగసందర్శనాభిలాష—

నెంతగా కొట్టుకొనియెనో యెఱుగరయ్య!—
ఈసతినిఁ గర్మసూత్రి మిట్లీడ్చెతుదకు॥— ౫౩

పెద్ది—ఎంతపుణ్ణాత్ముంరా లెంతపుణ్ణాత్ముంరాలు! మాట్టాడతా మాట్టాడతానే, మరణించిందయ్యా!—ఇందుకేకామోసు మంచోళ్ళ సంగతి మరణకాలానగాని తెలియదంటారు! పాపిష్టోణ్ణి— పండరాపురాన నాకైనా సావొచ్చింది గాదు—

జ్ఞాన—భక్తులారా! ఈమహాభక్తురాలు పాండురంగ సన్నిధానమున దివ్యులుమెచ్చఁదగిన మరణము నొందినది! ఈమెకొరకై— మనము బ్రహ్మానందము నందఁదగినదేకాని, యెంతమాత్రమును విచారింపరాదు. ఈమె పవిత్రదేహమునకు పుష్పాలంకార మొనరించి, దహనానంతరముననే బ్రహ్మోత్సవమును నిర్వర్తింతము. ఈమె దహనవిధికై మీరందఱును మీమీసమర్థతలకుఁదగినచందమున ద్రవ్యము ననుగ్రహింపవేడుచున్నాను. మఱియు నీమె పవిత్రమైన బ్రాహ్మణవంశమున జన్మించిన మహాభక్తురాలు! కావున నిచ్చటంగల పవిత్రబ్రాహ్మణోత్తము లందఱును సక్కుబాయి కళేబరమునకు బ్రహ్మరథము బట్టవలయును—ఇంతేకాక నో పుణ్యాత్ములారా!—

సీ॥ మేలైన పట్టుదుకూలంబులం దెచ్చి—
మృతదేహము నలంకరింపవలయు—
మల్లెమొల్లలును, చామంతి జపాపుష్ప
సంచయంబు నలంకరించవలయు—
చందనాగరు కాష్టసంచయాదికమును
చితిపైనఁ జేర్పింపఁ జేయవలయు
అనుకూలమైన సన్నియాజ్యఘటంబులఁ
జేర్పించి యాహుతి సేయవలయు

బ్రాహ్మణులు బ్రహ్మరథమును బట్టవలయు
వేదఘోషలతో వాద్య వితతితోడ,
పాండురంగని కీర్తించు భజనతోడ,
సక్కుబాయికి చితివిధి సలుపవలయు.— ౫౮

భక్త—జ్ఞానయోగీంద్రుల నిర్వచన మవశ్యాచరణీయము. ఇందులకు మేమందఱమును మనఃపూర్వకముగా నామోదించుచున్నాము.

జ్ఞాన—భక్తులారా! మీయామోదమునకు పాండురంగమూర్తి బ్రహ్మానందమునంది తాండవకేళి సల్పుచున్నాఁడు! ప్రపంచకము ధనమూలమైనదగుట మీరందఱు నెఱింగిన విషయమే కావున శక్త్యనుసారముగాచందాల ననుగ్రహింపఁ బ్రార్థించుచున్నాను.

పెద్ది—ఓస్! సందాలేటయ్యా! సందాలు—ఈ పాటెవ్వారానికి సందాలేయించాలంటయ్యా! బాగ్గెం—సక్కుబాయమ్మకోసం ఎంత లెక్కైనాసరే! నేనొక్కణ్ణెదాకలు జేత్తాను. కదనడపండయ్యా!

జ్ఞాన—ఓహో! ఇదియును పాండురంగని మహిమయే కాబోలును! భక్తులారా! మీకందఱకును ధనసేకరముసేయు శ్రమగూడ తప్పిపోయినది—

సక్కుబాయిగాత్రిమపువాఁడేయగు పెద్దిసెట్టియను భక్తుఁడు దహనసంస్కారమునకగు ధనమంతయునిచ్చెద ననుచున్నాఁడు.

అందఱు—జయా! పెద్దిసెట్టికిజయా—సక్కుబాయిక్ జయా—పాండురంగవిఠలునకుజయా—.

జ్ఞాన—భక్తులారా! ఒక్కమాఱు మనమందఱమును సక్కుబాయి పవిత్రాత్మకు సంతోషకరముగా పాండురంగ సంకీర్తనముఁగావింతము. రండు—

అందఱు—(భజనసేయుదురు.)

(అనుబంధము 9)

(తెర)



3 వ రంగము—పండరిపురము.

ప్రవేశము—నారదుఁడు.

నార—(అనుబంధము 10)

ఆహాహా! లీలామానుష విగ్రహుండగు శ్రీపాండురంగని చిత్రలీలలు పరమాద్భుతములుగదా!—

ఉ॥ ఎక్కడియగ్రహారమది యెక్కడి బ్రాహ్మణ మందిరంబు, తా
నక్కడసక్కుబాయికొరకై—ప్పుషరూపునఁ గృష్ణుఁడీగతిం
జిక్కుటయేమి? సక్కుతన జీవము లీపురిఁ బాయుటేమి? తా
నక్కడ బంధముక్తుఁడయి, యాహరి యీపురి జేరుటెట్లొకో॥ ౫౫

భక్తులందఱునుఁజేరి యప్పుడే సక్కుబాయి భౌతికదేహముస కగ్ని సంస్కారము గావించుచున్నారు. సక్కుబాయిశవము భూమిపై లేకుండ భస్మీభూతంబగునెడల, సక్కుబాయికిమాఱుగా మాయ సక్కుస్వరూపమున గాశీపతికి భార్యగా నటించుచున్న మాకృష్ణపర మాత్మకు శాశ్వతముగ నచ్చట నాజన్మాంత నిర్బంధదాస్యము తప్పదు గాఁబోలును. దైవమా! బ్రహ్మాండజాలములనెల్ల పోషింపఁ బ్రతిభ గల్గి—నీ మాయాజాలంబునఁ బ్రకృతిని బంధించిన నీవు నేటి కొక బ్రాహ్మణ మందిరంబున దాస్యంబునఁ దగుల్కొంటివిగదా! భక్తసంరక్ష ణార్థమై నీవెట్టి శ్రమలకైన నోర్చుచుంటివిగదా! స్వామీ!

గీ॥ పండరిపురంబునను సక్కుబాయి తనువు
దహనమందుట నెఱుఁగవో దాసపోష!

అచట నిర్బంధితుండ వెళ్లితివయ్యా?
ఏ యుపాయంబుఁ దోఁపలేదే! మహాత్మ!— ౫౬

ఇందులకు నాచేతనైనయుక్తిఁ గావించి, సక్కుబాయి భౌతిక శరీరంబు దహింపఁబడకుండ ధాత్రీతలంబున, నిల్పినంగాని, పాండురంగ దేవునకు దాస్యవిమోచనము కాఁజాలదు. ఈవార్తను రాధాదేవియు, రుకుమాబాయియు నింక నెఱుంగనట్లున్నారు ముందుగా వారలకీవృత్తాంతముం దెలియఁజేసి, పాండురంగదాస్య విమోచనోపాయంబును, వారితోడనే సంప్రదించెదఁగాక!

(అనుబంధము 11)

(నిష్క్రమించును.)



4 వ రంగము—పాండురంగదేవాలయము.

ప్రవేశము—చదరంగమాడుచున్న, రాధాబాయి, రుకుమాబాయి.

రాధా—అమ్మాయీ! రుకుమా! ఇదిగో! నాగుఱ్ఱమువచ్చి నీమంత్రిపైనను, రాజుపైనను, సమానముగా దూకినది. ఇప్పుడు నీవు రాజును రక్షించుకొనక తప్పదు గావున, మంత్రిపై నాశవదలుకొనవలసినదే!—

రుక్మి—ఓహో! నిజముగా ప్రమాదమే సంభవించినట్లున్నది.

(నారదుఁడు ప్రవేశము)

నార—అమ్మా! ప్రమాదము సంభవించినట్లుండుటగాదు. ప్రబలమైన ప్రమాదమే సంభవించినది?—

రాధా—ఓహో! మహాత్ములగు నారదమునీంద్రులు! ఆర్యా! నమస్కారము!

రుక్మి—మునీంద్రా! నమస్కారము. ఇందు దయచేయుఁడు.......... మహాత్మా! ఇటుచూడుఁడు! మాయక్క రాధాదేవి, చదరంగము నందలి నారాజునుబంధించి మంత్రిని మ్రింగివేయఁ జూచుచున్నది.

నార—అమ్మా! నిజతత్వము నెఱుంగమింజేసి, మీరిట్లు భావించుచున్నారు. కాని, నిజముగా నరికట్టినది మీ యక్కగారు కాదు. అరికట్టబడినది మీ చదరంగపురాజుగాఁడు.

రుక్మి—అదియేమి మునీంద్రా! అట్లనుచున్నారు? ప్రత్యక్షముగ చదరంగపుబల్లపై నరికట్టఁబడిన నారాజు, కన్నులకుఁ గాన్పించుచుండఁగా, కాఁడని పల్కెదరేమి?—

నార—అయ్యో! వెఱ్ఱితల్లీ! పైఁబడుచున్న మహాప్రమాదస్థితి నెఱుంగఁజాలక, మీరింకను చదరంగపువెఱ్ఱిలోనేయున్నారా?

రాధ—బ్రహ్మమానసపుత్రా! ప్రమాదమనుచున్నారేమి?

నార—పిదప మనవిచేయుదును. కాని ముందీమాట చెప్పుఁడు. జగన్నాథు లెందున్నవారు?

రాధ—భక్తసంరక్షణపరతంత్రులై—స్థలాంతరమున నున్నారు.

నార—ఎవరాభక్తులు?—చెప్పఁగూడనివారా?

రుక్మి—చెప్పఁగూడకేమి? సక్కుబాయి యను భక్తురాలు.

నార—అగ్రహారపురవాసినియే కద!

రాధ—ఔ నామెయే!

నార—అట్లయిన వారు శీఘ్రముగ మరలివత్తురా?

రాధ—రాకేమి? ఆసక్కుబాయి బ్రహ్మోత్సవ దర్శనార్థమిపు డిచటికే వచ్చియున్నది. ఆమెకుమాఱుగా నాథుఁ డాపురమున మాయా

సక్కుబాయియై యుండవలసివచ్చెను. సక్కుబాయి మఱలి యగ్రహారమున కరిగిన వెంటనే, స్వామి యిటకు విచ్చేసెదరు.

నార—ఇప్పుడు సక్కుబాయి యెచ్చట నున్నదంటిరి?

రుక్మి—ఇచ్చటనే—

నార—ఇచ్చటనేయున్నదా? బ్రదికియున్నదా? చచ్చియున్నదా?

రాధ—మునీంద్రా! మీపలుకులు నేడు విపరీతములుగ నున్నవియే!—

నార—అమ్మా! చచ్చిన సక్కుబాయి యింక నగ్రహారంబున కరుగు టెక్కడ? స్వామికి దాస్యవిమోచన మగుటయెక్కడ?

రుక్మి—ఏమేమీ! నారదా! సక్కుబాయి మరణించెనా?—

నార—నేటియుదయమున—స్వామిచరణ సన్నిధానమున—అల్లవిగో! గగనంబు నంటుచున్న యామంటలం దిలకించితిరా? అవి సక్కుబాయి చితాగ్ని కీలామాలలు!—చూడుఁడు—

సీ॥ ఉపవాసపరయు—భక్త్యుద్రేకయగు సక్కు—
జగదీశు దివ్యతేజమునఁ గలియ—
భక్తులందఱును, తద్బౌతికదేహంబు,
నెడఁగొని, యగ్నిసంస్కృతులుసేయ—
రూఢిగా నక్కా స్వరూపభావన, శాశ్వ
తంబుగా భువిని, లుప్తంబుగాఁగ,
విప్రమందిరమున వెలయు శ్రీనాథు, దా
స్యం బిక జన్మదాస్యంబుగాఁగ,
పండరీపుర విభవంబు పాడువడును;
కాంతలు, త్వదీయులందఱు సంతపింత్రు;
అగ్రహారమె కైవల్యమై రహించు;
నింతకన్నఁ బ్రమాద మింకేది? తల్లి! ౫౭

రాధా—అయ్యయ్యో! అట్లయిన నింకేది వెరవు?—ఆతురపడకున్న—నంతయును నాశనంబగు కాలమే దాపురించెనే!—మునీంద్రా! ఇందుల, కుపాయాంతర మేమైనఁగలదా?—

రుక్మి—కటకటా! ఎంతకష్టకాలము దాపురమయ్యెను!

గీ॥—అక్కటా! యుత్సవముఁగాంచి సక్కఁబోయి,
శీఘ్రముగ, స్వగృహముఁజేరు, శ్రీనివాసుఁ
డింక వచ్చుననుచు, నిరీక్షించుచున్న
యస్మదాదులకేది, మార్గాంతరంబు?॥ ౫౮

నార—సరిసరి! సంగతి నెఱింగించినయెడల, సదుపాయమెద్దియేని మీకైనఁ దోఁపకుండునాయని యాశించియున్న—నన్నే యుపాయము నడుగుచున్నారా? తల్లీ! తమకన్న నీమూఢాత్ముని కథకోపాయములు తెలియునా?—

రాధ—పలుకఁదలంచి యట్లు పలికెదవుగాక, నీవెఱుంగని యుపాయంబులు మాకుఁదెలియునా? విచిత్రకలహ నిర్మాణవేత్తవగు నీచరిత్రము చతుర్దశభువన విఖ్యాతముగాదా! నారదా!

సీ॥—పారిజాతమునిచ్చి భామతోఁ, రుక్మిణీ
దేవికికలహంబుఁ దెచ్చినావు—
గంగావతరణంబు గల్గిననాఁడు గం
గాగౌరులకు రాపొనర్చినావు—
పతిదానమను మిషఁబన్ని ద్వారకలోన
మంచికల్లోలముఁ బెంచినావు—
కౌరవ పాండవ వీరుల నడుమ నె
న్నెన్నియో కలహముల్ బన్నినావు
తలపనేటికి కలహభోక్త యనుపేర,
సార్థకాఖ్యనుగంటివో సంయమీంద్ర?

ధాత్రిలో, నీవులేని చరిత్రగలదె?
యుక్తులందు నిన్మీరు ధీయుక్తులెవరు? ౫౯

నార—అమ్మా! ఇదియంతయును నన్ను నుతించుటయా—నిందించుటయా?

రాధ—ఎట్లైననేమి? కలహాశన బిరుదాంకితుండవగు నిన్ను నిందించుటయు, స్తుతించుటయే యగునుగదా!—

రుక్మి—అక్కా! ఈ మాటలతోనేమి? కాలాతీతమైపోవుచున్నది. సక్కుబాయి శరీరము దహింపఁబడక మున్నే—చేయదగిన కార్యమెద్దియైన నున్నచో— చేయవలయునుగదా! నారద మునీంద్రా!—ప్రమాదకరంబగు నీయుదంతము నాలకించినప్పటి నుండియును, మాయిరువురి బుద్ధులును భ్రంశములై పోయినవి. మాకిక నెట్టియోచనయుఁదోపదు. స్వామికి దాస్యవిముక్తి ప్రసాదించుభారము నీయందే యున్నయది.

నార—అమ్మా! అంతటి సన్మానమునకు మీదాసుఁడు పాత్రుఁడు గాఁడు. కపటనాటక సూత్రధారియగు నా దేవదేవునకు దాస్య విముక్తినిఁగల్గింప, నల్పజ్ఞుఁడనగు నేనెంతవాఁడను. ఐనను— మీరింతగా నడుగుచున్నారు గావున, నాకుఁ దోఁచినయుక్తి నాలకింపుఁడు.

ఆ॥ జ్వలనమూర్తిఁ, సక్కుబాయినంటకమున్నె,
దివిజపురికి వైనతేయునంపి
వరసుధారసంబు వర్షింపఁగాఁజేయ,
బడినయెడల సక్కుబాయి బ్రదుకు. ౬౦

రుక్మి—ఆ యుపాయముచేత సక్కుబాయిని మఱల బ్రదికింపవచ్చునను కొందము. అంతమాత్రముననే ప్రయోజనమేమి? నాధునకు దాస్యవిముక్తి గలుగవలదా?

రాధ——అమ్మాయీ! సక్కుబాయి మఱల బ్రదుకునంతటి భాగ్యమే కల్గునెడల నాథుని దాస్యవిమోచన కార్యమేపాటిది? నయంబుననో, భయంబుననో సక్కుబాయిని మఱల స్వగృహంబున కంపఁగల్గుదుమేని, నాథుఁడు మనకు దక్కఁగలఁడు. నారద మునీంద్రా! ఇంతకన్న నుపాయాంతరము వేఱొకటిలేదు. ఈ యుక్తియే ప్రశస్తమై యున్నది.

రుక్మి——అట్లైన నిఁక కాలయాపనమేల? గరుత్మంతుని బంపి కడమ పని యంతయును మనము క్షణములో నిర్వహింతము. ఆపని మొదట చూడవలయును. రమ్ము——

(అందఱును నిష్క్రమింతురు)

(తెర)



5 వ రంగము——శ్మశానభూమి.

పరివేశము——{ సక్కుబాయిశవము కాల్చుచుండగా——భక్తులు భజనచేయుచుందురు.

(కొంతసేపటికి, మహావర్షము కురియును. అగ్నిచల్లారును. ఆ కాశమున, అమృతభాండముతో గరుత్మంతుఁడుకాన్పించి అమృతమును సక్కుబాయి కళేబరముపై వర్షించి వెడలిపోవును.)

సక్కు——(చితినుండిలేచి) రంగా! రంగా! పాండురంగా! ఎంతనిద్ర గల్గెనుస్వామీ!

జ్ఞాన——ఆహాహా! ఏమి మనయదృష్టము! పంచత్వమునందిన భక్తురాలు సక్కుబాయి, నిద్రలేచినభాతి పునర్జీవితయై——చితినుండిలేచి వచ్చుచున్నది.

అంద—జయా! శ్రీసక్కుబాయికి జయా! జయా! శ్రీపాండురంగ విఠల్ పరమాత్మకు జయా!—

జ్ఞాన—సీ॥ అనలుఁ డీమెశరీరమును స్పృశింప నశక్తుఁ
డౌట, భీతిల్లి చల్లారెనేమొ—
భక్తలోకమునుఁ బావనముసేయఁగభువి
కమరులింకొకతూరి యంపిరేమొ!—
పాండురంగఁడు సక్కుబాయి లీలలఁ దృప్తిఁ
జెందక బ్రదికింపఁజేసెనేమొ!—
మనయదృష్టము మూర్తిఁగొని సక్కుబాయిగా,
నవనిపై నవతారమందెనేమొ,
కాకయున్న నిర్ఘనాకాశతలమున,
కుంభవర్షధార గురియుటేమి—
చితి గతించుటేమి సతి పునర్జీవియై
మనుటయేమి, విష్ణు మహిమగాక॥ ౬౧

సక్కు—గురునాథా! నమస్కారము! ఇదియేమి? నేను స్వప్నలోకమునం దున్నానా ప్రకృతిస్థనై యున్నానా?—ఈశ్మశానమునకు మన మందఱు మేలవచ్చితిమి? పాండురంగదేవుని యాలయమున గదాయుంటిమి?

జ్ఞాన—అమ్మా! నీవు స్వప్నలోకమునలేవు—ప్రకృతిస్థవే యైయున్నావు! మన మీా శ్మశానమునకు వచ్చుటయు, మరల నీతోఁగలసి యానందముతో, రంగని సన్నిధికరుగఁ గల్గుటయు—శ్రీపాండు రంగని లీలలు!

గీ॥ పాండురంగని సన్నిధిఁ బరమపదము,
నందినావమ్మరో! మహానందలీల—
కాని, వెండియు నాశ్చర్యకరముగాగ,
బ్రదికి వచ్చితివమ్మ! మాభాగ్యవశత॥ ౬౨

సక్కు—ఆహా! ఎంతపనిజరిగెను! రంగా! రంగా! నీదివ్యసన్నిధిభాగ్యముం గాంచిన నాపై ననుగ్రహామువమాని, మరల నీపాపలోకముననే పడవేసితివాస్వామీ! నాదుష్కర్మమింకను పరిపక్వముం గాంచ లేదా?—

జ్ఞాన—తల్లీ! జగన్మాతవై—మహాభక్తశిరోవిభూషణమవై—దూరీకృత పాపలేశవై—పరమ పవిత్రజన్మవైన నిన్నుగాంచి పాపములే భీతినంది పటాపంచలై పోవుననిన, నింక వానికి పరిపక్వదశ గలుగలేదనుట శశవిషాణమునకు వాడిమి తక్కువయయ్యె ననుటగాదా? జగజ్జననీ! నీపై ననుగ్రహాములేక కాదు. మము బోటి పాపాత్ముల నందఱ ననుగ్రహింపఁదలంచియే, మనలగన్న తండ్రియగు శ్రీపాండురంగఁడు నీకు, అనితరదుస్సాధ్యమగు నీ పునర్జన్మముం బ్రసాదించెను. ప్రకృతి భయంకరమగు నీ శ్మశానభూమియందింక, మన కేమియుఁ బనిలేదు. ఆనందముతో పాండురంగని సన్నిధానమునకరుగుదమురమ్మి. భక్తశ్రేష్ఠులారా! పాండురంగ నామ దివ్యసంకీర్తనముఁ గావించుచు, మనమిఁక, నాలయమునకు భక్తురాలగు సక్కుబాయిం గొనిపోవుదము రండు.

(అనుబంధము 12.)

(అందఱును నిష్క్రమింతురు) (తెర)



## 6వ రంగము—అరణ్యమార్గము.

ప్రవేశము—శంభుశాస్త్రి, పెద్దిసెట్టి.

పెద్ది—సెంభుశాస్తుర్లంగారూ! సక్కుబాయమ్మ కాటికి అగ్గిముట్టించాం గందా! సాపుగా ఆశలొదులుకుని సేతులు గడుక్కొచ్చినట్టేనా?

శంభు—కళ్ళయెదుట కాష్టంబేర్చి అగ్నిపాలుచేసినతరువాత ఆశేముంది పెద్దిశెట్టీ?

పెద్ది—అదికాదయ్యా! కాష్టాలదిబ్బకాణ్ణుంచి, మనంరాంగనే, ఆకాశం బొక్కడ్డట్టు పెద్దవరషం కురిసిందిగెందా? అగ్గారిపోయి, సక్కూబాయమ్మ మళ్ళీ బతికిందేమోఅంటా—

శంభు—దీన్నే "దింపుడుగళ్లఆశ" అంటారు. అగ్నిఆరిపోతే ఆరిపోవచ్చునేమో—చచ్చిన సక్కూబాయి బ్రతకటమెట్లాగోయ్?

పెద్ది—ఏంటోనయ్యాచాత్తుర్లూ! నాకిదంతా అగమ్మెగోశరంగావుంది. సక్కూబాయమ్మతల్లి సచ్చిందంటే నాకేమీాం సమ్మకం లేదు. నిజంగా సచ్చిపోయిందంటయ్యా? ఆయిల్లాలు—

శంభు—ఏమిటోయ్! పెద్దిసెట్టీ—నిజంగానే అగమ్యగోచరపు మాటలాడుతున్నావు— మనస్సు చలించిందాయేమిటి?—

పెద్ది—మనస్సు సెలించిందాఅని అడుగుతుండావా శాత్తుర్లూ?-అచలు-మనస్సంటేయేంటి?—మనస్సంటే ఆత్తమ—ఆత్తమంటే పరమాత్మ—పరమాత్తమకూ—ఆత్తమకూ—బేధంలేదు—తత్తవం తెలియనోళ్లుకొందఱు—ఆత్మమవేఱే—పరమాత్తమ వేఱేఅని వాగుతుండారుగానీ—పెద్దిచెట్టి యేదాంతచాత్తరంలో రెండూ వొకటే—పెద్దిచెట్టి యేదాంతమంటే యేంటోయిన్నావా?—ఇనకుంటే చెప్పుతాను—శెవులొగ్గియిను—

## తత్త్వం

ఆత్తమంటేయేమిరా పరమాత్తమంటే యేమిరా!
ఆత్తమకు పరమాత్తమకు అవంతబేదము లేదురా
అన్నమంటేయేమిరా మరిసున్నమంటేయేమిరా?
అన్నమూా సున్నమూా గలిసితే అంతతెల్లనిదానురా!—

శివుండంటేయెవడురా కేశవుండంటేయెవడురా?
శివుడు కేశవుడొక్కరూపై జీవలోకమునేలురా!
అండమంటేయేమిరా బ్రహ్మాండమంటే యేమిరా?
అండములు పిండములు మఱి బ్రహ్మాండములు హరిమాయరా
జీవులకు నందఱికి పెద్దిసెట్టి వేదాంతాముర—
చావుబ్రతుకులేనిదారిని సాగియిక పోదాముర ॥ఆ॥ ౬3

శం—గల్లాపెట్టెవదలిపెట్టి కవిత్వమెప్పుడు నేర్చుకున్నావుపెద్దిశెట్టీ?— అరధ్జానం అపాయకరమన్నారుసుమా! తప్పుడురాతలురాసి తద్దినాలు పెట్టించేవు—జాగ్రత్త!—

పెద్ది—తప్పా గిప్పా నాకు తెలువదు. నోటింబటొచ్చిందంతా కపీశమే! ఈ దేహానికీ రేగటిమన్నుకూ బేదంలేదు. రూపాయిలకీ సిల్లపెంకులకీ అంతకన్నా బేదంలేదు. పుట్టిననాడు కట్టుకొరాలేదు. గిట్టిననాడు కట్టుకొపోయేదిలేదు.

'పొయ్యేటప్పుడు వెంటరాదు వొకపుచ్చినగవ్వైనా!' అన్నారు యేమన్న తాతగారి బోదలన్నీ యేదాంతాలే! ఎఱగనోళ్ళు బూతు మాటలనుకుంటారు. తెలిసినోరికి తియ్యమామిడిపండు—తెలియనోరికి యిసముష్టిపండు—సకూబాయమ్మ సచ్చిపోయిందనేవోళ్ళు—జూటాకోర్లు—యాదాంతపు తత్తవం తెలిసినోళ్ళకి సావేంటి బతుకేంటి? అంతా వొక్కటే!—

## తత్త్వం.

1 మంటలోకాలేది మంటిలోకలిసేది । మాయదేహము మాత్రమేనోయి । సద్గురుడ । వేయేల జీవాత్మకాదోయ్ ॥మం॥

2 పుట్టునపుడెట్టులో । గిట్టునపు డట్టులే । పోయేది దేహమేనోయీ । సద్గురుడ । జీవాత్మ నిత్యమేనోయీ ॥మం॥

3 చుట్టాలు స్నేహితులు కాష్టానికేకాని । ఆపైన వెంటరారోయీ। సద్గురుడ । అవనిలో నెవరికెవరోయీ ॥మం॥

4 భార్యలూ బిడ్డలూ । పశువులూ గృహములూ ।. పాపిష్ఠిబంధనాలోయీ । సద్గురుడ । యీజన్మతో నేసరోయీ ॥మం॥ ౬౮

శంభు—(స్వగతము) పిల్లికి పిడచైనావేయని పీనాసిపెద్దిసెట్టికి కొండంత వైరాగ్యమబ్బడం—అక్షరాలైనా సరిగ్గాకూడబలుక్కో లేనివాడికి అకస్మాత్తుగా ఆశుధారాశక్తి గల్గడం ఆశ్చర్యంగానేవున్నాయి. మనస్సేమో చలించి, కొంచెమించుమించుగా వెఱ్ఱిధోరణిలో పడ్డట్టుతోస్తూంది. (ప్రకాశము) పెద్దిసెట్టీ!—హద్దూ అపూ లేకుండా యేక ఆశుధారకింద, చదివేస్తున్నావు. ఈకవిత్వమంతా ఎప్పుడు నేర్చుకున్నావు?

పెద్ది—నేరుసుకోడమేంటయ్యా! ఎఱ్ఱిబాపడా!—ఆమహాలక్ష్మి సక్కూబాయమ్మతల్లి యెదటనిలఁబడి, చదివించేస్తూంటేను—

శంభు—సక్కూబాయమ్మ చదివించెయ్యడమేమిటి? ఎదట నిలబడడమేమిటి? సక్కూబాయమ్మ చచ్చిపోయిందిగాదటోయ్?

పెద్ది—సక్కూబాయమ్మ చచ్చిపోయిందంటే—మూతిపళ్లు రాలగొట్టేస్తాను. కళ్లులేని యెదవలకు సచ్చిపోయింది—మతిలేని శుంటలకి సచ్చిపోయింది—బుద్ధిలేని గాడిదెలకి సచ్చిపోయింది—ఆలోశనలేని అవోవాజెమ్మలకి సచ్చిపోయింది. మనలాంటి యేదాంతులకి సచ్చిపోవటమేంటయ్యా?—అదుగో! అదుగో! సక్కూబాయమ్మ! నీకు కళ్లున్నాయా? కళ్లుంటే కనపడుతుంది!—నాయేలికిసూటిగా ఆకాశంకాసిచూడు. రంగారంగా అని బజనజేత్తూంది సక్కూబాయమ్మ—కాళ్లకి గజ్జెలుకట్టుకొని తాండవిత్తూంది, సక్కూబాయమ్మ—పాండురంగసామికి పడీపడీ మొక్కుతూంది సక్కూబాయమ్మ—ఆతల్లి బజనలోగలిపి—

మనంగూడా బజనసేతాం పాడవయ్యా బ్యాపనయ్యా పాడు—
మన పాడుజలమలకి, ఇంతకన్నా మంచిసమయం దొరుకుద్దా?—
(తాళమువేయుచు పాడును)

— పాట —

రంగారంగా రంగారంగా రంగారంగా యనవే మనసా।
రంగరంగవైభోగుని కస్తురిరంగని సన్నిధిగనవే॥రం॥
వేదవేద్య శ్రీరాధానాథుని పాదపద్మముల బడవే మనసా।
వాదములాడక వారిజనాభుని పావనకథచెవినిడవే॥రంగా॥
అన్నియుతానై అన్నిటవేరై యున్నపరాత్పరు గనవే మనసా।
పన్నగశాయిని పలుపులుఁదలఁచిన పాపముదొలగును మనసా॥రం॥

శంభు—పెద్దిసెట్టీ! ఏమిటాఅల్లరి? నీకుపిచ్చిపట్టిందా? సక్కూబాయి భూతమైఆవేశించిందా? భజనలోపడి అడుగవతల పెట్టకుండా వున్నావే?—ఎన్నడైనా యిట్లా ఎగుర్లుబెట్టావా?—నడు—త్వరగా యింటికివెళదాం—

పెద్ది—(శంభుశాస్త్రిని పెద్దగా వీపుపైఁజఱచి) బజనచెయ్యరాబాబూ అంటే యెత్తియేదాంతాలు సెపుతావేంట్రా బ్యాపనోడా! నాకు పిచ్చేంట్రా! పిచాచమంట్రా? ఎవఁడికిరా పిచ్చి? ఎవఁడికిరా పిచాచం? నీకా నాకా? (తిరిగి కొట్టును)

శంభు—అబ్బ! నియ్యమ్మకడుపుకాల! పిచ్చిముండకొడకా! ఎంతెంత చఱుపులు చఱిచావురా?— పోనీగాని— సక్కూబాయమ్మ తాలూకు మంగళసూత్రాలూ నగలూ జాగ్రత్తగా వున్నాయా?

పెద్ది—ఓ! అతిజాగర్తగావున్నాయి. ఈ జీవాత్మ దేహంలో ఎంత జాగర్తగావుందో అంతజాగర్తగా వున్నాయి—

శంభు—ఈపిచ్చిలో ఎక్కడనైనా పారేస్తావు. నాచేతికిచ్చెయ్యి—ఆవిడయింట్లో యిస్తాను—

పెద్ది—అమ్మా! బ్యాపనోడికెంతాశ! నీచేతికిస్తే అమ్ముకొతిందామని సూత్తుండావా? ఎంతదురుబుద్దిపుట్టిందీ!

శంభు—ఆవిడ నగలు నేనమ్ముకుంటానా?నీమనస్సు తిన్నగాలేదు. పారే స్తానని అడుగుతున్నాను.

పెద్ది—సెస్! వల్లగాదు. సాయంగా నాసేతుల్తో వొట్టుకెల్లి సక్కూబా యమ్మ అత్తకిచ్చెయ్యాలె! అంతే_మల్లీ కిక్కురుమన్నావంటే_ మక్కెలిఱగమొదుత్తాను. నడు—

శంభు—(స్వగతము) పిచ్చిముండకొడుకు-నిజంగానే చంపేటట్టున్నాడు. వీఁడెక్కడ దాపరించాడ్రాబాబూ నాకు!—(పకా) ఊఁ! ఐతే పద!—

పెద్ది—ఊరికేమెల్లటమా! బజన!—బజనజేసుకుంటా మెల్లాలె! పాడు బ్యాపనోడా—నాతోగూడాపాడు—పాడాల్చిందే!—

శంభు—బలవంతపు బ్రాహ్మణార్థంలాగుంది. ఊఁ—ఐతే నీశ్రాద్ధం— ఏదోపాడుమఱి!—

పెద్ది—(పాడును)

తత్త్వం.

ఎందుకీ సంసారమూ? నిస్సారమూ। ముందు వెనుక నపారమూ।
ఎందుకీసంసార । బంధము గ్రహచారమిందలి మమకారమెందు
పారావార ॥మెం॥ ౬౬

శంభు—(బలాత్కారముగా పాడుచుండును.)

పెద్ది—ఊరికేపాడతం గాదోయ్! ఎట్టెప్పా! ఎయ్తాళం—(కొట్టును)
శంభు—నీముండామోయు! కొట్టడం మొదలుపెట్టావేమిరా!—

(తాళమువేయుచు పాడును)

(తెర.)

7వ రంగము—అగ్రహారమునందలి కాశీపతియిల్లు.

ప్రవేశము—శయనమందిరమున కాశీపతితో మాయాసక్కుబాయి.

కాశీ—నిజంగానా?

సక్కూ—నిజంగానే—మీతోడు—నేనబద్ధమాడుటలేదు.

కాశీ—కాదు కాదు. సక్కూ! అబద్ధమే ఆడుతున్నావు! తప్పకుండా నీదగ్గఱ మందో మంత్రమోవుంది. లేకపోతే—అమ్మ—అమ్మ ఎటువంటిరాక్షసి ఎట్లామారిపోయింది!—మాఅమ్మంటే సామాన్యురాలా? ఊళ్లోవున్న కరణాలూ కాపులుగూడా ఆవిడ నోటికి గడగడలాడేవారు—వెధవకరణాలూ కాపులూలెక్కేమిటి? దయ్యాలూభూతాలూ సమేతూ ఝడిసి పారిపోయేవి! అటువంటిమనిషి అతివిచిత్రంగా మారిపోయి, "సక్కూ నాసక్కుతల్లీ! సక్కుబాయమ్మతల్లీ!" అని పిలుస్తూ—ఇంటిపెత్తనమంతా నీకప్పగించేసింది! భగవంతుడిపేరు వినబడితే భగ్గున మండిపడేమనిషి భారత భాగవతాలు వింటూ భక్తురాలైపోయింది! ఏదో మంత్రమో మందో ప్రయోగించి మాఅమ్మను వశపరుచుకున్నావు!

సీ॥ పాండురంగాయన్న మండిపోయెడుకాంత,
భక్తులతోఁగూడి పాడఁదొడఁగె;
పండరిపురికి నిన్నంపని గయ్యాళి,
యాత్రలుసేయ నాయత్తమయ్యె;
పిల్లి కెంగిలియైనబెట్టని శతలోభి
బీదల కన్నంబు బెట్టసాగె;
విగ్రహంబును బారవేసిన నాస్తిక,
స్వగృహాన, దేవతార్చనము నిలిపె;
భక్తిలేనిమూఢ భాగవతాదుల
నాలకింప మిగుల నాశగొనియె;

ఇంతలోన నింత వింతైన మారుపు
గలుగఁగలదె యి ట్లకారణముగ?॥— ౬౭

సక్కు—నాధా! శ్రీవిఠలదేవుని కృపారసప్రాప్తి కతంబున బండు లోడలు నోడలు బండ్లునగుట యొక ఆశ్చర్యమా? నిజముగా నాకు మందులును మంత్రములును దెలియుననియును అందు వలననే అత్తగారిబుద్ధి కీపరివర్తనముగలిగెననియును దృఢముగా నమ్మఁదురేని, వినుఁడు,

ఆ॥ మంత్రిగత్తెనంచు మదివిశ్వసింతురో
పాండురంగమంత్ర పఠనగలదు;
మందుగలదటంచు మదినమ్మియుందురో,
కలదుమంచిమందు తులసిదళము॥— ౬౮

ఎటులయిననేమి—అత్తగారు భక్తురాలయ్యె. నదియేమనకు మహాభాగ్యము!—ఈవ్యర్థ ప్రసంగమునకేమిగాని, పారాయణసమయమైనది. వారుగో అత్తగారు గీతాశాస్త్రశ్రవణ కుతూహలాయత్తచిత్తులై వచ్చుచున్నారు—

(నిలువఁబడును)

(అత్త భగవద్గీతతో ప్రవేశము)

అత్త—శ్లేష్మంలోపడ్డ యీఁగవలె—ఈపాడుసంసారంలో, ఈదుకోగా, యీదుకోగా, యిప్పటికి తెమిలి బయటఁబడ్డానుతల్లీ!—నిన్న చదివినదగ్గఱనుంచీ—భగవద్గీత చదువమ్మా సక్కూ!—

సక్కు—చిత్తము. (చదువును)

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం । యోగినం సుఖముత్తమం
ఉపైతి శాంతరజసం । బ్రహ్మభూతమకల్మషం॥ ౬౯

అర్థము—ఆత్మయందు హృదయమును చలనరహితముగా నుంచుటచేత, సమస్తపాపములును ఉపశమింపగా, రజోగుణము శాంతినొంది, అందువలననే, శుద్ధాత్మరూపముతోనుండు నీయోగిని ఆత్మానుభవరూపంబైన యుత్తమసుఖమును గాంచును.

అత్త—అమ్మాయీ! సక్కూ! ఐతేనూ—ఈశ్లోకాలన్నీ స్వయంగా శ్రీకృష్ణభగవాన్లవారు తమనోటివెంట చెప్పినవేనా?

కాశీ—నోటివెంట చెప్పకపోతే కళ్ళవెంట చెపుతాడా?—చెవులవెంట చెపుతాడా? అన్నీ పిచ్చిప్రశ్నలు వేస్తావేమమ్మా!—

అత్త—అదిగాదురా! కృష్ణభగవాన్లే చెప్పారా? కాక వారుచెప్పినట్లు మఱొహ కవీశ్వరులెవ్వరైనా చెప్పారాఅని అడుగుతున్నానురా!

సక్కు—అత్తగారూ! మఱియొక కవీశ్వరు లెవ్వరును, చెప్పినవిగావు. శ్రీవిఠల్ భగవానులే, స్వయముగా అర్జునున కుపదేశించిన గీతామహావాక్యములివి.

ఆ॥ జగమునందుగ్లాని సంభూతమగువేళ,
నొక్కొకరు మహాత్ము లుద్భవింతు;
ద్వాపరంబునం దుదయమంది—శ్రీకృష్ణ
మూర్తి—గీత లోకమునకుఁ దెల్పె॥— ౭౦

అత్త—ఓయబ్బా! ద్వాపరంనాడుచెప్పిన గీతలఁటే యివ్వి? ఇంతకాలందాకా, ఇవన్నీ, నాశనంగాకుండా, ఎల్లావున్నా యో!

సక్కు—ఆశ్చర్యమేమి? ఆకాల మీకాలమువంటిదికాదుగదా!—

క॥ అప్పటి గురుకులవాసము,
లప్పటియావేదపఠన మప్పటిమేధ
స్సిప్పటికాలంబున, వా
జప్పలకింతైనఁదెలియ నగునా? కలిలోఁ॥— ౭౧

కాశీ—నిజమేనేలఅమ్మా! అప్పటికాలంలో, వేదంపఠ్నాలుగుపాన్నాలూ, భుజాన జంఝెముగ్న ప్రతివాఁడికీ హృత్కవిలెగా వుండేది. అప్పుడీదిక్కుమాలిన తప్పులతడికెల అచ్చుకూటాలు, లేకపోవ డంచేత, ప్రతిగురువూ పరంపరగా, శిష్యులకు నేర్పుతూవుండే వారు. వచ్చినచదువు చచ్చినా—పోకుండా, ఱాయిలాగ వుండిపోయేది. ఇప్పుడు, ఎంత ఘనవిద్వాంసుఁడైనా, అచ్చు పుస్తకాలుచూచి చదవడమేగాని, బునాది యేడిస్తేనా?—

అత్త—మీనాయనగారూ అల్లాగే, నీకు వేదంచెప్పాలనీ, నిన్ను తనంత ఘనుణ్ణిచెయ్యాలనీ, మహాశ్రమపడేవారు. ఐతే, యేం లాభం?— చదువుకోవడానికి నిన్నెప్పుడుపిలిచినా— కడుపు నొప్పి-కాలునొప్పిఅని వంకఁబెట్టి, గోళీకాయలో, గాలిపటాలో ఆడుకోడానికి వెళ్లేవాడవు. తుదకొక్క అక్షరమైనా అబ్బిందేకా దు. ఇప్పుడు చూడుమఱి? ఆఁడపిల్ల—అందులోభార్య ఎంచక్కా భగవద్గీతంతాచదివి, చదువురాని మొద్దులకు మనకు విని పిస్తూందో నీకేనాలుగక్షరాలు అబ్బివుంటే—ఎంతముచ్చటగా వుండేది! దీపంబెట్టి మొక్కుకోవాలె— ఆమహానుభావుఁడు మీనాన్నగారు, ఎంతకీర్తి సంపాదించారు—ఎంతవిద్వాంసుఁ డని పించుకొన్నారు! ఎన్నియజ్ఞాలుచేశారు! ఎన్నిదానాలుచేశారు— ఇంట్లో వెయ్యవిస్తరీ తియ్యవిస్తరీ—నిరతాన్నదానంగదా— ప్రాణాలు హరీఅనేదాక, నీవు బాగుపడకపోతివే అన్నవిచారమే కాని ఆయనకు మఱొహ విచారం వుండేదిగాదుగదా! ఇంతకూ ఎవరికెంతప్రాప్తమో అంతేగాని అధికం రమ్మంటే ఎల్లా వొస్తుందీ? (కన్నీరు నించును)

కాశీ—ఊరుకో! ఊరుకో!!—ఎందుకేడుస్తావులే? ఛావఁగొట్టి చెవులు నులిమి, నాలుగుముక్కలుచెబితే, నాకు, చదువంటకపోయిం దా?—నాకు బాగాజ్ఞాపకం—నాయనగారు ఎప్పుడు చదువు

చెప్పొచ్చినా—నువ్వొహదానవు దాపరించి, నన్ను గారాబం జేసి, ఒక్క అక్షరమైనా అంటనిచ్చేదానవుగాదు. చేసుకున్న దానికిప్పుడేడుస్తున్నావు, ఎవరినంటావు?

అత్త—పోనీలేరానాయనా! అన్నితప్పులూనావే! ఈసోది మనకెప్పుడూ వుండేదేగాని, ఏదమ్మా సక్కూ! ఇంకోశ్లోకం?—

సక్కూ—(చదువును)

శ్లో॥ ఏవం యుఞ్జన్ సదాఽఽత్మానం। యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ। మత్యంతం సుఖమశ్నుతే॥ ౭౨

అర్థము—ఈవిధమై యోగియగునాతఁడు ఆత్మయోగాభ్యసనముచేతనే, అన్నివిధములగు పాపకల్మషములను పోగొట్టుకొని, బ్రహ్మానుభవాకృతిగల్గి—అత్యంతమగు సుఖమును, నిరంతరమును అనుభవించుచుండును.

కాశీ—సక్కూ! ఈవేళ నాకేమో అమితదాహమౌతూంది. చల్లని మంచినీళ్ళు తెచ్చిపెట్టు—

సక్కు—భాగ్యము. (ముందుకువచ్చి స్వగతము) సక్కుబాయి పండరిపురమున మరణించినవార్త నెఱిగింప, నాభక్తులిచటికి వచ్చుచున్నారు. ఇంక నేనిట నుండరాదు. అందులకే, యీబ్రాహ్మణున కిప్పుడు నేను మృషాదాహకల్పనముఁ జేసితిని. ఈక్షణమే నాదాస్యమున కంతము—

ఆ॥ భక్తురాలిగావ బ్రాహ్మణదారనై
దాసినై చరించి దాస్యకర్మ
సలుపఁ బాలువడితి, సరియయ్యె నేటితో
సక్కుబాయియత్త సాధువయ్యె॥ ౭౩

(నిష్క్రమి)

(శంభుశాస్త్రి—పెద్దిసెట్టి ప్రవేశము.)

తత్త్వం.

పెద్ది—కట్టలేచుట్టాలు। కట్టెలేబంధువులు। కన్నతల్లెవ్వారే చిలుకా। నిన్నుమోసేలు నలుగురూ। వెంబడీపదిమంది। వెంటనెవరూ రారు చిలుకా। ఊరికీఉత్తరాన। సామాధిపురములో। కట్టయిల్లున్నదే చిలుకా। ఉసురులుండేదాక। వూరికే మూగేరు। కడకు తోలగొత్తురేచిలుకా ॥క॥

అత్త—ఏమిటీ అపశకునంపాట?

కాశీ—ఏమిటోయ్! పెద్దిసెట్టీ—యాత్ర కెళ్లినతరువాత వేదాంతం నేర్చుకున్నావాయేమిటి?

పెద్ది—అంతమయ్యేటప్పుడు పట్టుబడేదివేదాంతం—చిలుక దేహంలో ఆడేదాకా జీవుడు సంసారములో దాగుడుమూత లాడుతాఁడు. ఆపైన జీవుఁడూ దేవుఁడూ వొకటే—జీవుఁడంటే దేముఁడు-దేముఁడంటే కాముఁడు—కాముఁడంటే రాముఁడు—రాముఁడంటే భీముఁడు—జీవుడు, దేముఁడు, కాముడు, రాముఁడు—భీముఁడు—భీముడోయ్ భీముఁడు.

అత్త—అయ్యో! అయ్యో! పెద్దిసెట్టికి పిచ్చెత్తింది కామాల్సునురా పాపం!

శంభు—నిజంగా పిచ్చేనండి పాపం, పండరీపురంలో సక్కూబాయమ్మ మరణించడంమొదలు—ఇదేవిధంగా పిచ్చిపిచ్చిపాటలు పాడుతున్నాఁడు—నాయెముకలు చూర్ణమయ్యేటట్టు చావఁగొడుతున్నాఁడు.

కాశీ—ఆఁ! ఆఁ నీకూ పిచ్చిపట్టినట్టేవుంది, యాత్రకెళ్ళి ఇద్దఱూ పిచ్చివాళ్లై చక్కావొచ్చారా? అయ్యొప్రారబ్ధమా!

శంభు—నాకుపిచ్చిలేదు—వెఱ్ఱీలేదు. బాగానేవున్నాను.

అత్త—పిచ్చికాకపోతే యేమిటయ్యా నీపిండాకూడు—సక్కూబాయి చావడమేమిటె?. అవాచ్యంగా నోటికెంతమాటొస్తే అంత మాటా ఆడడమేనా?—నిండింటో యీసారి అప్రాచ్యపు కూతలుకూసిచూడు, ఏంజేస్తానో!—

కాశీ—అది యే సక్కూబాయోనే అమ్మా! అడగందే ఆగ్రహపడతా వెందుకు మనసక్కూబాయి నెందుకంటాడూ? శంభుశాస్త్రిని మనమెఱుగమా యేమిటె?—అంత బుద్ధిహీనుఁడా?—

శంభు—కాశీపతిగారూ! నన్ను వెఱ్ఱివాఁడికిందకట్టక, సావకాశంగా మీరైనా, నామాటలు అర్థంచేసుకోండి!—

అత్త—ఇంతకూ ఏసక్కూబాయి చచ్చిందయ్యా'—

శంభు—కోపపడకండమ్మా! పండరీపురంలో—పాండురంగస్వామిపాద పద్మాలసన్నిధిని, మీసక్కూబాయే మరణించిందండీ!—

అత్త—మాసక్కూబాయంటే, నాకోఁడలు సక్కూబాయేనా?—

శంభు—చిత్తం—మీకోఁడలు సక్కూబాయమ్మే—

అత్త—కాశీ! పిచ్చిముండాకొడుకుల్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టక, చూస్తా వేమిరా?

కాశీ—ఏమిటయ్యా! శంభుశాస్త్రుల్లూ!—పిచ్చికూతలుగూస్తూ చావు లూ బ్రతుకులూ శాపనార్థాలుబెడుతూ, నాకు పిచ్చిలేదంటా వెందుకూ?

శంభు—నాకేంపిచ్చెండీ మీరుగూడా అట్లాగే అంటారు!—

అత్త—పిచ్చిగాకేమిటింకానూ? ఒక్కగడియకిందట నాకోఁడలు పుస్తకం చదువుతూ యిక్కడేవుండెను. పండరీపురాన చచ్చిందని వాగుతూంటివి!

శంభు—(ఆశ్చర్యపడి) ఏమిటీ? ఒక్కగడియకిందట, మీకోడలు పుస్తకంచదివిందా? ఏంవిపరీతపు మాటలు!—

పెద్ది—కొట్టూ! బ్యాపనోణ్ణికొట్టూ—సక్కూబాయమ్మ చావలేదురా సావలేదురా అంటే వొక్కడై నాయిన్నాండా! ఇప్పుడనపగించు-

కాశీ—ఏమిటీగొడవంతా!—వాండి మాటలేమిటో వీండిమాటలేమిటో-ఒకటీ అర్థంగాదు—

అత్త—అర్థంలేదు వాళ్ళశ్రాద్ధంలేదు—పిచ్చిముండాకొడుకుల వాగుడుకు అర్థమేమిట్రా?—పొండి పిచ్చిముండాకొడుకుల్లారా! శనిగ్రహాల్లాగ మాకొంపకు చేరారేం?—

శంభు—ఉపకారానికొస్తే అపకీర్తి వెంటబడ్డది. అమ్మా! మీరు తిట్లతో శాపనార్థాలతో వెళ్ళగొట్టనక్కర్లేదు. ఎట్లాగూ వెళ్ళిపోతాంగాని, మరణకాలంలో మీకోడలి తాలూకు మంగళసూత్రాలూ ఆభరణాలూ మాకు వశపర్చబడ్డవి. అన్యాయంగా వాటిని మేముంచుకోదలచలేదు. మీవి మీరు ముట్టజూచుకోండి. వెంటనే మాదారిని మేము వెళతాం—ఇవ్వవయ్యా పెద్దిసెట్టీ!

పెద్ది—(నగలమూటతీసియిచ్చుచు) చతనూనంబవతి—చతాయుప్రతిత్తిష్టతి—లాబాలేలాబాలు—కాచీపతిమళ్ళా పెళ్ళాడేట్టుంటే—కానిడబ్బైనా కరుసులేదు—కాళీసంచీపెత్తనమంటే పెద్దసావుకారు పెద్దిసెట్టిదే!—సరిగ్గా సూసుకోండి. ఆనక, అదిలేదిది లేదంటూరు—

కాశీ&అత్త—(ఆశ్చర్యముతో పరిశీలించుచుందురు)

శంభు—అయ్యా! కాశీపతిగారూ! నన్నుపిచ్చివాణ్ణిగాయెంచి, మీతల్లిగారూ మీరూ అనరానిమాటలన్నారు. మీభార్యా సక్కూ

బాయమ్మ పండరాపురికివచ్చి, తనభక్తిచేతనూ—గానం చేతనూభక్తులనందర్నీ తన్మయచిత్తుల్ని జేసి భక్తిపారవశ్యంచేత పాండురంగడి పాదాలదగ్గరే జీవితాలు వదలింది. మహావైభవంగా దహనసంస్కారాలు చేశారు. ఇదంతా ప్రత్యక్షంగా మాకళ్లతో చూచిన విషయంగాని, గాలివార్తకాదు. నీలివార్త గాదు. సక్కుబాయమ్మ మీయింట్లోనేయున్నదనీ—గడియ కిందట పుస్తకంచదివి, వినిపించినదనీ మీరంటున్నారు! మీ మాటలైనా అబద్ధాలై వుండాలె—మాకళ్లకు భ్రాంతైనా కలిగివుండాలె!—రెండూమాత్రం నిజంకాలేవుగదా! ఈమహామాయ ఏమిటో నాకర్థంకాకుండావుంది. మీఆభరణాలు పండరాపురాన్నుంచి మోసుకొచ్చి భద్రంగా మీకప్పగించిన పాపానికి తలవాచేలాగ బహుమానాలుమాత్రం దొరికినవి. అందుకేకాస్త విచారపడవలసి వస్తూంది. ఏదియెట్లావున్నా మీసొత్తు మీకు చేరింది. మాభారం తీరింది. ఇకమాకు సెలవిప్పిస్తే వెళతాం—రావోయ్‌పెద్దిసెట్టీ!—

(ఇరువురు—నిష్క్రమింతురు)

కాశీ—అమ్మా! ఈవస్తువులు మనకోడలివి గావంటే?

అత్త—సందేహమేమిటి? కోడలివే!

కాశీ—కోడలివొంటిమీద నగలున్నవే! ఇవి పండరీపురాన వీళ్ళపరం కావడమేమిటి? కోడలు చావటమేమిటి?—శంభుశాస్త్రిమాటలు పిచ్చిమాటలందామా అంటే, ఈ నగలకేమనాలె?—ఇప్పుడు గాదటమ్మా మంచినీళ్లు తెమ్మంటే సక్కులోపలికి వెళ్ళింది!—

అత్త—లోపలింకా యేంజేస్తూందో? అమ్మాయీ! సక్కూ!—సక్కూబాయమ్మా!—పలకదేంపాపంరో కాశీ!—

కాశీ—ఇదిగో! ఏంజేస్తున్నావులోపల! ఒకసారిట్లారా—ఏమేవ్! వినపడ్డంలేదూ!—

అత్త—వినపడ్డంలేదు. కనపడ్డంలేదు—నేను లోపలికెళ్ళి చూచొస్తానుండు— (నిష్క్రమించును)

కాశీ—ప్రత్యక్షంగా సక్కు చావడం—దహనంచేయడం చూచామని చెపుతున్నాఁడే శంభుశాస్త్రి!— మఱొకసక్కూ చస్తే మన సక్కూఅనుకోవడానికి అతఁడు దాన్నెఱగనివాఁడా!—ఎఱిగినా ఎఱక్కపోయినా నగలుదెచ్చి యిస్తున్నాఁడే!— ఏమిటబ్బా యీ చిత్రం?—సక్కూ అక్కడ చచ్చినమాటనిజమైతే— ఇక్కడున్నసక్కూయెవరైనట్టు? దయ్యమా భూతమా?

(అత్త పునః చీరెతో ప్రవేశము)

అత్త—మనసక్కూ మాయమైపోయిందిరో నాయనా కాశీ! ఇంకెక్కడిసక్కూబాయమ్మరోతండ్రీ!కొంపమునిచిది—ఇంకేముంది! ఈచీరమాత్రం చిలక్కొయ్యని తగిలించుంది. సక్కూ లేదు—చట్టుబండలూలేదు.

కాశీ—ఆఁ? ఆఁ?— లేకుండాపోవడమే?—ఇంతసేపూ పుస్తకం జదివి లోపలికెళ్ళింది. ఇంతలో యేమైపోతుందమ్మా! తిన్నగా చూచావా?—

అత్త—అయ్యో! ఇంకెక్కడి తిన్నఁగాచూడ్డంరా నాయనా! మనసక్కూ మాయమైపోయిందిరాతండ్రీ!—మననోళ్ళలో మన్నుబోసిందిరా కాశీ!—

కాశీ—ఏమి టీమాయ? మనసక్కు నిజంగానే చచ్చిందాయేమిటే అమ్మా?

అత్త—ఏమోరా నాయనా! అంతా అగమ్యగోచరంగావుందిరా నాకు! అప్పుడు చావడమేమోగాని యిప్పుడు నిజంగా చచ్చిందిరా!—

(నలుగురు పౌరులు ప్రవేశము)

1 పౌ—ఆహాహా! ఎంత అదృష్టవంతుఁడవయ్యా! కాశీపతీ!—

అత్త—అదృష్టమెక్కడిది తండ్రీ! మాసక్కూ మాయమైచక్కాబోయింది నాయనా!

2 పౌ—మాయమైందా? నిజంగా మాయమైందా?

కాశీ—నిజంగానే మాయమైంది శాస్త్రుల్లగారూ!—అది భగవద్గీత చదువుతూంటే మాఅమ్మా నేనూ వింటున్నాము. ఇంతలో ఎక్కణ్ణుంచొచ్చిందో నాకు మాయదాహం పుట్టుకొచ్చింది. మంచి నీళ్ళుతేవేలంటే లోపలికెళ్ళింది. అదే ఆఖరుమాపనుకోండి. ఇంతలో శంభుశాస్త్రీ పెద్దిసెట్టీ పండరీపురాన్నుంచి చక్కావొచ్చారు. మీసక్కూబాయి పండ్రాపురంలో చచ్చిపోయిందని నగలమూట తెచ్చియిచ్చారు. ఇదేమిచిత్రంరా అని చూతుముగదా కట్టుకున్న చీరమాత్రం చిలక్కొయ్యకు తగిలించివుంది. మాసక్కూ కనబడదు.

2 పౌ—అందుకే అదృష్టవంతుఁడవన్నాము. సక్కూబాయి మరణవార్త శంభుశాస్త్రి చెబితే మేమూ యిప్పుడేవిన్నాం—

అత్త—ఐతే—ఈమాయ ఏమిటంటారు మీరు?

1 పౌ—ఇంకా ఏమిటని సందేహపడతారెందుకు? అర్థంకావడంలేదూ?-

శా॥ అంధప్రక్రియ సక్కుబాయినటు యాత్రార్థంబు పోనీక ని
ర్బంధింపం దొరకొంటివీవు హరి తద్బంధంబులూడ్చెఁ దయా
బంధుండై చనుదెంచి నీకుచ్ఛమై—వర్తిల్లె—మీసక్కుఁ తా
సంధించెఁ నిరవద్యమోక్షపదవిఁ సద్భక్తితో పండరిఁ॥ ౭౮

3 పౌ—సెబాసు కాశీపతీ!—మహాపతివ్రత భార్యగాలభించినందుకు అయాచితంగా ఇహపరాలు రెంటా ధన్యుఁడవై నావుగదా!

గీ॥ మొదటసాధ్విని భార్యగాఁ బొందినావు,
పిదప పాండురంగఁడె నీకు సుదతియయ్యె;
ధన్యుఁడై నాఁడ విహపరోత్తారకముగ
అగ్రహారము పావనంబయ్యె నేడు॥ 28

అత్త—ఐతేనూ—శర్మగారూ! ఇన్నాళ్ళనుంచీ మాకు సక్కూబాయమ్మ లాగు కనఁబడుతూవుండేది నిజంగా సక్కూబాయి కాదంటారా సాక్షాత్తూ రంగఁడేనా?

4 పౌ—ఇంకా సందేహమటమ్మా తల్లీ!—ఆమాయసక్కూ స్వరూపం రంగఁడేకాకపోతే—కలలోనైనా భక్తిఅంటే యేమిటో యెఱగనిదానికి నీకు భగవద్గీతవినాలనే సద్బుద్ధి యెందుకుగల్గిందో, ఆలోచించుకోలేవూ? ఎటువంటిదానవు—ఎటువంటిదానవుగా మాఱిపోయినావో—నీమనస్సుకు నీకు తోఁచడంలేదఁటమ్మా!—

కాశీ—ఆమాటమాత్రం నిజమేనేఅమ్మా!—

అత్త—పాండురంగడిచేత కోరంటికం చేయుంచుకున్నానని తలచుకుంటే నాశరీరమంతా చెమటలుపోసి వొణుకుపుడుతూందేమండీ శర్మగారూ!

3 పౌ—అనగూడదుగాని భగవంతుఁడిచేత సేవజేయించుకున్న మీా పాపానికి నిష్కృతివుందా?

1 పౌ—భగవానుఁడు గీతల్లో— "మమమాయాదురత్యయం" అన్నాఁడు. అది నేటికి మనకు, అనుభవానికొచ్చింది.

2 పౌ—భగవంతుఁడిలీలలు అమూల్యాలు. అగమ్యగోచరాలు.

బ్రహ్మేంద్రాదులంతటివారే తెలుసుకోలేకపోయినారు. మన మెంతవాళ్ళము.

1 పౌ—ఇంతకూ, భగవంతుఁడు మీపుణ్యవశంచేతనే, మీకు దర్శన స్పర్శనభాగ్యాలు కలిగించాఁడు. మేమంతా పాపాత్ములం.

కాశీ—శాస్త్రిగారూ! చివరకు మేమిప్పుడు చేయవలసిన కార్యమే మిటొ? భగవంతుఁడిచేత సేవచేయించుకున్న పాపం—మాసక్కూ బాయిని బాధపెట్టినపాపం మాకు ఏవిధంగా తీరుతుంది! అను గ్రహించి మాకేదో మీరొక కర్తవ్యం ఉపదేశించాలె!—

1 పౌ—కర్తవ్యానికేముందయ్యా! కాశీపతీ!—

ఉ॥ పోయినసక్కు విష్ణుపదముంగనఁబోయెను ధన్యురాలె—మీ
రాయమతోడనేగెడు మహత్తర భాగ్యముఁగాంచరైతిర
న్యాయముగా సతీతిలకనారడిపెట్టి రమేశుదాస్యమా
ప్యాయముగా సహించితిరి పండరికేగి తరింపుఁడింకపై. ౭౬

మీతోఁగూడ మేమనేకులము పండరికివచ్చి శ్రీపాండురంగని సేవించి పాపపరిహారముగావించుకొనే ఉత్సాహతోనున్నాము. ఈదినమే; మనప్రయాణానికి చక్కనిముహూర్తమున్నది. బయలుదేరండి.

కాశీ—చిత్తం—మాతో ఇంకావచ్చేవారుంటే అందర్ని సిద్ధంగావుండ మని చెప్పండి.—

(అనుబంధము 13)

(అందఱు నిష్క్రమింతురు.)

(తెర.)



8 వ రంగము—పండరిపురమున పాండురంగదేవాలయము.

ప్రవేశము—భక్తిచేపరవశయైయున్న సక్కుబాయియు, అత్తయు, కాశీపతియు, జ్ఞానయోగియు, అగ్రహారపుపౌరులు.

భక్తులందఱు—(అనుబంధము 14 .)జయ్! భక్తసక్కూబాయికీజయ్!—

(సక్కుబాయిపై—పుష్పవర్షముఁగురిపింతురు.)

జ్ఞాన—అమ్మా! సక్కుబాయీ!

సీ॥ అంటి యంటనిరీతి, నింట సంసారివై
భవపంకముఁ దరించితివి గదమ్మ!
ఒకవంక బాధల నొందుచున్నైన
రంగనిమీఁది భక్తి మానవుగదమ్మ!
అత్త స్తంభంబున కణచి కట్టినఁగూడ
దివ్య యాత్రకు వచ్చితివిగదమ్మ!
పండరి పురమందు ప్రాణముల్వాసియు.
క్షితి పునర్జన్మఁగాంచితి గదమ్మ!
ఇపుడు నీయత్తయును, భర్తయిటకువచ్చి
నారు; నీకృపఁ గోరుచున్నారు? తల్లి!
విమల సద్భక్తి పారవశ్యమున నుండి,
కన్నులను విప్పి మముఁ గృపఁగాంచుమమ్మ॥

సక్కు—(కన్నులువిప్పి) ఓహో! ఏమినాభాగ్యము ! మహాత్ములగు జ్ఞానయోగీంద్రులా? స్వామీ! నమస్కారము!—

జ్ఞాన—తల్లీ! అల్పజ్ఞాన సమేతులమగు మాదృశులందఱకన్న నతీతవై ప్రకాశించుచున్న నీ నమస్సుల నందుటకు మే మనర్హులమై యున్నారము. అదిగాక—

గీ॥ ఇతఁడు నీజీవితేశ్వరుం డీమె నీకు
నత్తగారును; వీ రగ్రహారజనులు;
నీమహాద్భుత కథవిని నిన్నుఁగాంచి
పావనత నంద నిచటికి వచ్చినారు॥ ౭౮

కావున—నాకన్నముమ్మందు—వీరు నీకు మాననీయులు; కృపామతివై తొలుత వారి ననుగ్రహింపుము.

సక్కు—ఓహో! ఎంతప్రమాదము?—(సంభ్రమముతో వారికినమస్కరించుచు) అత్తగారూ!—అభాగ్యురాలగు మీకోడలు సక్కుబాయి నమస్కరించుచున్నది. నాథా!—దాసురాలి నమస్కారములు!—

అత్త—(లేవనెత్తి) నాతల్లీ! నీవు నాకులపావనివి. నిన్నుఁ దెలియక యనేక బాధలుపెట్టాను. ఆపాపం నాకెన్నిజన్మాలకైనాతీరదు. మావంశము, ముయ్యేఁడుతరాలూ తరింపఁజేసిన భక్తశిఖామణివి నీవు. నేను వట్టి అజ్ఞానురాలిని. నాకు నీవు నమస్కరించఁగూడదు. నీపాదాలమీఁది ధూళిసోకితే నేను తరించిపోతాను. సక్కూబాయమ్మతల్లీ! నీకే నానమస్కారాలు.

సక్కు—అత్తగారూ!—కించిజ్ఞను—అల్పవయస్కను—నగు నాకు మీరు నమస్కరించుట నాకు శ్రేయఃకారణమగునా? మీరు పెద్దవారు. నాకు, సదా పూజ్యులు.

కాశీ—అయ్యా! జ్ఞానయోగీంద్రులవారూ! మేము, పూజ్యులైన మిమ్మల్ని మన్నింపఁదగ్గ అనేక భక్తుల్ని అజ్ఞానంచేత—అనేక బాధలుపెట్టాము.అందుకు మాకే ఘోరనరకం ప్రాప్తిస్తుందో-దేవుఁడే యెఱుఁగును. ఆసంగతట్లావుంచండి. మాసక్కుబాయి యీావూళ్లో—పాండురంగఁడి సన్నిధిని మొదట చచ్చిపోయిం

దనీ, తరువాత బ్రదికిందనీ—మీరంతా అంటున్నారు. ఇందలి మాట అబద్ధమనడానికీ వీల్లేకుండావుంది. కాని, యింతకాలం నుంచీ, మా సక్కుబాయి, మాయింట్లోనే చక్కగా కాపరం చేస్తూంది. ఇందులోవున్న మాయయేమిటో—నిర్ధారణచేయఁ దగ్గవారు మీరు—కాకపోతే యిక్కడఁ జేరిన భక్తబృందము—వారూ కాకపోతే పాండురంగఁడు. మేము, అజ్ఞానులము.

జ్ఞాన—కాశీపతిమహాశయా!—ఈజగమునంగల యదృష్టవంతులలో నీవు మహాదృష్టవంతుఁడవు; ఏలనన—

ఆ॥ సక్కుబాయి, యిచట చచ్చి జీవించుట
కల్లగాదు—మీకు, కాంతయగుచు
పాండురంగమూర్తి వర్తిల్లె; మీయట్టి
భాగ్యశాలి యొకఁడు వసుధఁ గలఁడె? ౭౯

భక్తావన దీక్షాపరతంత్రుఁడగు పాండురంగనాథుని దివ్యలీలా విలాసమేకాని, యిందన్యమగు మాయయెద్దియునులేదు. మీరును, మీజనయిత్రియు పూర్వజన్మమున మహాతపంబెద్దియో కావించినారు. కానిచో, నెంతవారికి జగన్నాధునిచేత దాస్యము చేయించుకొనుమహా భాగ్యము గల్గును.

1 పౌ—నేనుచెప్పలేదఁటయ్యా కాశీపతీ! చివరకునామాటే నిజమైంది.

జ్ఞాన—అమ్మా! సక్కుబాయీ!—

గీ॥ సాధ్వీరో! నీదుశ్రమలెల్ల సమసిపోయె,
భక్తులందగ్రగణ్యవై ప్రబలినావు;
అత్తగారు—భర్తయును—మోదాబ్ధిఁదేల,
నింటసంసారివై యుంట హితమునీకు॥— ౮౦

సక్కు—స్వామీ! అనతిక్రమణీయమగు తమహితోపదేశము, నాకు సదా, శిరోధార్యమైనదియే! ఐనను—

సీ॥ శ్రీరంగనాథుని సేవించినట్టి యీకనులతో, నన్యంబుఁ గాంచనోప
భువనాధినాథునిఁ బూజించినట్టి యీచేతుల నితరంబుసేయనోప;
పాండురంగని పాటఁబాడిననాల్కతో నన్యవాక్యంబుల నాడనోప;
రంగాలయమ్ముఁజేరఁగ మరిగినకాళ్ల నన్యస్థలంబుల కరుగనోప;

విఠలదేవుదాస్యమ్ముఁ గావించినట్టి
యీతనువుతోడ నితరమౌసేతలోప;
రంగని యనుగ్రహమునకై—కొంగుసాచి
కడమజీవితమిచటనే గడుపుదాన॥— ౮౧

ఈయపరాధమునకు నన్ను క్షమింపవలయును.

అత్త—అమ్మాయీ! సక్కుబాయీ! నీవులేని ఆపాడుకొంపలో మాకు మాత్రమేముందితల్లీ! నీతోపాటు మేముగూడా యిక్కడే వుంటాము. అనుగ్రహించు.

కాశీ—జ్ఞానయోగీంద్రులవారూ! మాకుగూడా సంసారంమీఁద విరక్తి పుట్టింది. మా అమ్మచెప్పినట్టు మేమూ యిక్కడేవుంటాము.

(పాండురంగమూర్తి ప్రత్యక్షమగును)

పాం—భక్తశిరోరత్నమా! సక్కూబాయీ! పరమపూజ్యుఁడగు జ్ఞానయోగీంద్రుని యాజ్ఞను శిరసావహించి, నీవు నీయత్తగారితోడను, భర్తగారితోడను—స్వగృహంబున కరిగి నాపై భక్తిమానక, సంసారిణివై—ఇహంబున— నైహికసౌఖ్యంబులును, పరంబున పరమపరమపదలాభంబునుఁ గాంతువుగాక! అనన్యదుర్లభంబగు నాదర్శనంబున మీయందఱి పాపంబులును,

పటాపంచలయ్యెను. సక్కూ! నీవుకోరినయపుడు నేను, నీకు మీయగ్రహారంబున సయితము, దర్శనమొసంగి, నీకానందముఁ గల్గించెదము. నాయాజ్ఞగా నీవిప్పుడే యగ్రహారంబునకు నీవారితో నరుగుము.

సక్కు—మహాభాగ్యము.

పాం—జ్ఞానయోగీంద్రా! మీకింకఁ గావలసినదేమి?

జ్ఞాన—పురాణపురుషా—యుష్మద్దివ్యసందర్శనమే—మాయభీష్టముల నన్నిటినీడేర్చెను. ఐనను—ఇట్లగుఁగాక!—

గీ॥ పుడమిసాధ్వుల కిడుములు తొలఁగుఁగాక'
ఎల్లరును భక్తినీశు భజింత్రుగాక!
యవని నస్పృశ్యతా దోషమణఁగుఁగాక!
కవిత, జనసమాదరణంబుఁగాంచుఁ గాక!! ౮౨

పాం—తథాస్తు!

అందఱు—మహాప్రసాదము. ధన్యాత్ములమైతిమి. జయ్! శ్రీ పాండురంగవిఠలదేవునకు జయ్!

(అనుబంధము 15.)

(తెర)

శ్రీ సతీసక్కుబాయి నాటకము

పంచమాంకము, సర్వమును

సంపూర్ణము.



# అ ను బ ం ధ ము.



## 1 జ్ఞానయోగి & శిష్యులు.

మధ్యమావతి—త్రిపుట తాళం.

పండరీపురవాస । శ్రీశ ॥పం॥ అండకోటిసృజించేదొరరార॥పం॥

1 నిండుగా నీబొజ్జలో బ్ర । హ్మాండకోటిధరించిపెంచి । బండలో మండూకములకు । తిండివెట్టు బ్రహ్మాండనాయక॥పం॥

2 శివవిధాతృసురేశులైనా । సిద్ధసాధ్యనాగేశులైనా।
నీవిలాసమహాద్భుతంబు । నెఱుఁగలేరుపరేశ దురితనాశ ॥పం॥

## 2 జ్ఞానయోగి.

మోహనరాగం—ఆదితాళం.

రంగరంగ । ఖగరాజతురంగ ।ర। థాంగహస్త । దానవభంగా।

1 దయాంతరంగ ।య। భయాంతరంగ । విషయాప్రసంగ । విమల సంగా ॥రంగ॥

2 శ్రీనివాస । ఖలదానవనాశ । యశేషభువన సంతతపోషా ।
సురేశనాయక । సుధాప్రదాయక । పరాపరాత్పర । భవదూరా।
॥రంగ॥

3 మంగళాంగ ।శ్రీ। రంగనివాస య । నంగవిజయ శ్రీలలితాంగా
గదాధరాచ్యుత । విదారితాహిత । పదాంబుజాంచిత భవగంగా
॥రంగ॥

## 3 సక్కుబాయి.

ముఖారి—త్రితాల్. (జాయిూపరతోనే అనుమట్టు)

రంగా । భవభంగా । శ్రీరంగా ॥రం॥
మంగళరూపా । మహితకలాపా ॥రం॥

మోహనమైన నీ । మురళీనాదము।ఆహా।శ్రవణానందముసేయగ ।
శ్రీహరి పాపపుకనులకు నీమృదు । దేహము గనుపడదేమి
విచిత్రమో॥రం॥

4 భక్తులు—అందఱు.

మోహన—ఆదితాళం.

పాండురంగావిఠలే । శత । పాపవిభంగావిఠలే॥శ్రీ॥పాం॥
భండనభీమా । పావననామా । ఖండితదానవ పటలేవిఠలే॥ పాం॥

1 పన్నగతల్పావిఠలే । ముని । సన్నుతకల్పావిఠలే ।
కన్నడసేయకు । మన్ననబాయకు । కస్తూరీహితనిటలేవిఠలే॥ పాం॥

2 లోకనాయకావిఠలే । దుర్లోకనాయకావిఠలే ।
ప్రాకటకరుణా । పావనచరణా।నేకవైరిహర చటులేవిఠలే॥ పాం॥

5 జ్ఞానయోగి & శిష్యులు. (అంతారామమయంవలె)

అంతారంగమయం । ఈజగ । మంతారంగమయం ॥అం॥

అంతులేని జగమందలిభూతము । లంతరంగములు నఖిలదిగంతము॥అం॥
నరసురగరుడులు।నానాజగములు।నరవిందభవభవాదులుసాధులు ॥అం॥
మశకంబాదిగ మదగజాంతమగు । మహిజాతచరాచరలోకంబులు॥ అం॥

6 సక్కుబాయి.

కన్నడరాగం—ఆదితాళము.

బృందావనమునువదలిరావుగా । నందకుమారా । నవనీతచోరా॥ బృం॥
ఇందురాగనీకిదియొకదూరమ । డెందముభారమ।గరుడగమననీ॥ బృం॥

1 సభలోద్రౌపది । చాలగమొరలిడ । నభయమొసంగితి । వదిమఱచి
తివా।ఇభరాజునురక్షింపగరయమున।నేగికథనీ।వేగతిమఱచితో॥ బృం॥

2 డింభ కుడాసభా। స్తంభ మునందున।నవతరింపుమని।యా ర్తినిబిల్వగ।
సంభోజభ వా।ద్యమరులుబాగడగ।సంభ వమంద వె సరగుననరహరి॥ బ్రం॥

7 కృష్ణుఁడు—(కంఠాభ రణమట్టు)

హింఁడోల్ రాగం—జప్ తాల్.

భ క్తావనంబు ధీ । యుక్తాశయముగల్గై । ము క్తియును కష్టాంమును గాంచె భ క్తమణి ॥భ॥

వ్య క్తిచేత నె.దాస్యయుక్తుండనై తి నా।శ క్తిచేతనె భ క్తియుక్తులను గాజేసి ప్రా క్తనాఘంబులను బాపెదనువీరికిక । భ క్తియుతమగు సక్కుబాయి రూపకమందు ॥భ క్తా॥

8 సక్కుబాయి & భ క్తులు.

మోహనరాగం—ఆదితాళం.

ధన్యులమైతిమిగా । రంగా ॥ధ॥

ధన్యులమైతిమి । తమదర్శనమున । మాన్యతగాంచెను మాచరితంబులు ॥ధ॥

బహుభవసంపా । దితదురితంబులు । పండరిపురమున భగ్నములయ్యెను ॥ధ॥

9 జ్ఞానయోగ & భక్తులు.

(మానసహాయకారీ మురారీ అనుమట్టు)

ధన్యధన్యా! సాధ్వీలోకమాయీ।
మాన్యగుణదాయీ । శ్రీ సక్కుబాయీ ॥ధన్య॥
శాశ్వతంబైన నీయాత్మకెంతో । శాంతి।
విశ్వంబునంగల్గునింతీ ॥ధ॥

## 10 నారదుఁడు.

భూపాలరాగం—దాద్రా

కృష్ణకృష్ణకృష్ణా । గోపాలబాలకృష్ణా ॥కృష్ణ॥
గోపాలబాలకృష్ణా । గోవిందబాలకృష్ణా ॥కృ॥
వేణులోలకృష్ణా । సుగుణాలవాలకృష్ణా।
శ్రీనివాసకృష్ణా । బుధ । మానపోషకృష్ణా ॥కృ॥

## 11 నారదుఁడు.

హిండోల్—ఆదితాళం.

నీ । మహిమ తెలుఁగదరమె । నీరజభవశంకరామరులకును ॥నీ॥
కామజనక । పరమాణువు మొదలుఁగ । ఘనతర మేరుధరాధరముదనుక,
భూమిగల్లుసకలభూతతతులను । విశ్వమూర్తివై । వెలుఁగుచుండెదు॥నీ॥
ఈమహిమలో నీదశావతారము । లెల్లసృష్టిపరివర్తనమేకద ।
కామరూపివై జ్ఞానమూర్తివై । సామగానలోలుఁడవై చెలఁగెదు ॥నీ॥

## 12 సక్కుబాయి, జ్ఞానయోగి, భక్తులు.

మధ్యమావతిరాగం—ఆదితాళం.

రంగారంగా రంగారంగా । రంగారంగాయనుఁడీ।
మంగళాంగు శ్రీపండరిరంగని మదిలో దలచండీ ॥రం॥

1. పెద్దలమనుకొని విఱ్ఱవీగి నిరు । పేదల బోరిగొనకండీ।
హద్దుమీరి యమకింకరులీడ్చెదు । నప్పుడేడ్వబోకండీ ॥రం॥

2. పాడుబిరుదులకు భ్రమపడి నీచుల । పాదములను బడకండీ।
మూడునాళ్ళముచ్చటయని తెలియక । మోసగింపబడకండీ ॥రం॥

## 13 కాశీపతి, అత్త, పౌరులు.

బిళహరి—ఆదితాళం.

పయినంబయినేడే చనుదము శ్రీపండరిపురిగల పాండురంగని గన ॥ప॥

భయదంబగు నీభవజలరాశిని।భక్తినౌకనావలకుఁ దరింతము॥ప॥
స్వయముగ, పూర్వానేకజన్మములసలిపిన పాపవితానము సమయఁగ, జయజయరంగాయని వినుతించుచు । జన్మరహిత మగుసద్గతిఁగాంచఁగ ॥ప॥

## 14 సక్కుబాయితప్ప ఆరంగమునందలి వారందఱును.

శ్రీరాగం—ఆదితాళం.

పరమసాధ్వీశిరోమణి సక్కూబాయినెన్న దరమే ॥ప॥
మరణముఁగాంచియు, మహిమాన్వితయై—
మరలఁబునర్జన్మంబు నందెఁగా॥ప॥
ఈసాధ్వీమణి పాదధూళిచే నెల్లజగంబులునూ ।
భాసమానముగ, పరమపావనత వర్ధిల్లెడునికనూ ॥పర॥

## 15 మంగళము.

మంధరధర మంగళకర మంగళంబురా । మారసుందరా శ్రీర మేశ బ్రోవరా । దాసభరణ దోషహరణ దానవేశనాశా । రాజ రాజేశ్వరా ।. యోపరాత్పరా । శ్రీని । వాసజగధీశా । శ్రీరమా నాయకా । జగన్నాయకా ॥మం॥

సం పూ ర్ణ ము.

